Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

దొరలు దోచలేరు

పంపినవారు:
కె. బి. రామమూర్తి - ఒంటిమిట్ట

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక ఫోటో శీర్షికల పోటీ, కార్టూనులు,
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

చందమామ (అన్ని భాషలలో)
విడి కాపీ **50** నయా పైసాలు. (**8** అణాలు)
సాలు చందా రు **6** లు.

టెలిఫోన్ : 3132

# సి. ఎమ్. ఆర్. అండ్ కంపెనీ,

హెడ్డ్ ఆఫీసు :

**313, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1**

బ్రాంచి : 27/14, హై రోడ్డు, చిత్తూరు.



★

ఆల్విన్ అండ్ ఫోల్డ్‌డీలక్సు
ఉక్కు ఫర్నీచర్లు, ఆస్బెస్టోస్
సిమెంటు షీట్లు, ఏ. సి.
పైపులు, ఫిట్టింగుల డీలర్లు.

★

చెంగల్పట్టు జిల్లాకుకూడా ఆల్విన్ అండ్ ఫార్డీలక్స్ ఉక్కుఫర్నిచరు డీలర్సు



*All keyed up!*

ప్రతి మర్ఫీ రేడియో సెట్టు మీ గృహానికి మరింత ప్రతిష్ఠ చేకూర్చటానికి నిర్మించబడింది. ....ఏళ్లతరబడి మీకు మధురగానం వినిపించటానికి సృష్టించబడింది !

# murphy

ఈనాటి అత్యంత ప్రియమైన రేడియో !



**SOUNDS GOOD!**
**LOOKS GOOD!**

మోడెల్ 254

* 6-వాల్వ్ 4-బాండు * ఏసి అండ్ ఏసి/డిసి (2 మోడల్సు) * రు. 390

లోకల్ టాక్సులు అధనం

దక్షిణ ఇండియాలో సోల్ ఏజంట్లు — మహమద్ ఇబ్రహీం అండ్ కో., ప్రైవేట్ లి., 7/8, మౌంట్ రోడ్డు, మద్రాసు-2 — బ్రాంచి : బెంగళూరు.



# ఎడారి నౌక

సముద్రాలపై నౌకా యాత్రలను గురించి ఒళ్లు పులకరించే కథల్ని చాలా చదివేవుంటారు. కాని యీ కథమాత్రం "ఎడారి నౌక" ను గురించింది. "ఎడారి నౌక" నిజంగా నౌక గాదు. అదేంటో చెప్పుకోండి చూద్దాం?

ప్రపంచంలో చాలా ఎడార్లు వున్నాయి కదా! మన భారతదేశంలో కూడా ఎడారి వొకటుంది. ఎడారిని ఇసుక సముద్రం అనొచ్చు. రోడ్లు లేవు. ఎద్దుబండ్లు, మోటార్లు, ఇసుక దిబ్బల మీద పోలేవు. పట్టపగలు అదో భూలోక నరకంలా వుంటుంది. అలాగని ఎడారంతా ఇసుకమయం అనుకోకండి. అక్కడక్కడ 'ఓయసిస్' అనే సారవంతమైన పసిరిక స్థలాలున్నాయి. ఇక్కడ పనిపాట్లు చేసుకుంటూ చాలామంది ప్రజలు నివసిస్తున్నారు. ఇక్కడ రాకపోకలకు యీ "ఎడారి నౌకే" ఆధారం.

మనదేశంలో వున్నదే రాజస్థాన్ ఎడారి. ఇక్కడున్న 'ఓయసిస్'లలో పనిపాట్లు చేసుకుంటూ అనేకమంది నివసిస్తున్నారు. ఇక్కడి ప్రజలకు టీ—అందులోనూ బ్రూక్ బాండ్ టీ అంటే మహా యిష్టమట. ఎక్కడెక్కడ వున్న వారికీ బ్రూక్ బాండ్ టీ అంటే ఎంత యిష్టమో మీకు తెలుసుకదా? మరి వీరికి కావలసిన టీ ఎలా సరఫరా అవుతోంది? ఈ "ఎడారి నౌకే" వారికి తోడ్పడుతోంది. ఇదొక జంతువు. యీ జంతువులోని గొప్ప విశేషం ఏమిటో తెలుసా? రోజుల తరబడి నీ రక్కర లేకుండా వుండగలదు. నీళ్లెక్కడున్నదీ యిట్టే పసికట్టేస్తుంది. ఇదే ఒంటె. మండు టెండలో, ఇసుక దుమారాల్ని కూడా లక్ష్యపెట్టక ఎడారిలో మనుషుల్ని చాల జాగ్రత్తగా రవానా చేస్తుంది. అందుకే ఒంటెను "ఎడారి నౌక" అని అన్నారు.

బ్రూక్ బాండ్ సేల్స్‌మన్లు వారి "నౌక"— ఒంటె — సహాయంతో యిక్కడి ప్రజలకు సతనిత్యమూ తాజా బ్రూక్ బాండ్ టీని ఎలా అందిస్తున్నారో చూశారా!

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

BB 228

# ఏ రకపు ఆభరణాలైనా



గాజులుగాని కంఠహారములు కాని కంకణములుగాని, చెవి పోగులేగాని ముక్కుకాడలేకానీ—బంగారు ఆభరణాలు ఏవైనా సరే (సాదావి, నగషీ చెక్కినవి, రత్నాలు పొదిగినవి), ఇవిగాక—వెండితో చేసిన డిన్నర్, టీ, కాఫీ లేక లెమన్‌సెట్లు—అనేక రకాలు, నమూనాలు సిద్ధంగా వున్నవి.........

కావాలంటే, మీ కొలతల ప్రకారం సరిగా తయారుచేసి యివ్వబడును.

అనమానమైన పనితనము.



*Vummidi*

**RAMIAH CHETTY, GURUSWAMY CHETTY & CO., *Jewellers***

23-25, CHINA BAZAAR ROAD, MADRAS-1.








## పరిపూర్ణమైన ముఖవర్చస్సునకు!

నేషనల్‌వారి

## కాశ్మీర్ స్నో

ది నేషనల్ ట్రేడింగ్ కంపెని, బొంబాయి-2 * మదరాసు-1







**J. B. MANGHARAM & CO.,**
**GWALIOR, INDIA**

*makers of famous biscuits*

జె. బి. మంఘూరామ్ అండ్ కో.,
గ్వాలియర్, ఇండియా

ప్రసిద్ధిగాంచిన బిస్కత్తు నిర్మాతలు

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

సృష్టిలో ప్రతిప్రాణీ సుఖాలను కోరుతుంది, దుఃఖాలనుంచి తప్పించుకోజూస్తుంది. అయినా ప్రాణులకు సుఖదుఃఖాలు సంప్రాప్తమవుతూనే ఉంటాయి. ప్రాణు లన్నిటిలోకీ మనిషి ఒక్కడే భవిష్యత్తును గురించీ ఉత్తమలోకాలను గురించీ ఆలోచించగలవాడు. అయినప్పటికీ ఎక్కడో ఒకడుమాత్రమే ఉత్తమ లోకాలకోసం ఈ జీవితంలో కృషి చేస్తాడు.

ఈ విషయం "మూగవాడు" [జాతక కథ]లో స్పష్టం చేయబడింది.

సంపుటి 22 జనవరి 1958 సంచిక 1



# అట్టవిూది బొమ్మ

కౌరవ బలాలను ఒంటరిగా జయించి తన గోవులను తెచ్చుకోవటానికి రథం ఎక్కి కూచున్న ఉత్తరుడు, "బృహన్నలా, మనం కౌరవులను ఓడించి త్వరగా తిరిగి రావాలి గనక రథాన్ని వేగంగా యుద్ధరంగానికి తోలు!" అన్నాడు.

బృహన్నల అదిలించేసరికి గుర్రాలు వాయువేగాన పరిగెత్తసాగాయి. కొద్ది సేపట్లోనే శ్మశానం వచ్చింది. రథాన్ని శమీవృక్షం దగ్గిరికి చేర్చి బృహన్నల ఉత్తరుడితో, "అవిగో కౌరవబలాలు! చూడు!" అన్నాడు.

సముద్రంలాగావున్న కౌరవసేనను చూడగానే ఉత్తరుడు భయంతో వణికి పోయాడు. అతనికి చేతులూ, కాళ్ళూ చల్లబడి ముచ్చెమటలు పోశాయి.

"బృహన్నలా, ఇంతసేనను దేవతలుకూడా జయించలేరు. నేను ఒంటరి గాణ్ణి ఎలా జయిస్తాను? నా శరీరమంతా గగిరిబొడుస్తున్నది. రథాన్ని వెంటనే వెనకకు తిప్పు!" అన్నాడు ఉత్తరుడు.

"కుమారా, నీవు భయపడటం చూసి శత్రువులు నవ్వుతున్నారు. కౌరవులతో యుద్ధంచేసి గోవులను విడిపించటానికై బయలుదేరి వచ్చావు; ఆపని పూర్తిచేయకుండా ఇంటికి ఎలాపోతావు? పోతే అక్కడి ఆడవాళ్లంతా నిన్ను చూసి నవ్వరా? కౌరవులను జయిస్తానని వారివద్ద ప్రగల్భాలు పలికావుగదా?" అన్నాడు బృహన్నల.

"కౌరవులు గోవులను తీసుకుపోతే పోనీ, ఆడవాళ్ళు నన్నుచూసి నవ్వితే నవ్వనీ! నేనుమాత్రం ఆ సేనతో యుద్ధంచేయను!" అంటూ ఉత్తరుడు రథం నుంచి కిందికిదూకి పారిపోవనారంభించాడు. అర్జునుడు అతనివెంట పరిగెత్తాడు. వారినిచూసి కౌరవసేనలు నవ్వసాగాయి.

నూరు అంగలలో అర్జునుడు ఉత్తరుణ్ణి అందుకుని అతనిజుట్టు పట్టేసు కున్నాడు. ఉత్తరుడు దణ్ణాలుపెడుతూ, "అమ్మా, బృహన్నలా! నన్ను పోనిచ్చావంటే నీకు బోలెడంత బంగారమూ, రత్నాలూ, పది ఏనుగులూ ఇచ్చుకుంటాను!" అని వేడుకున్నాడు.

"పిరికివాడా, నీకు భయమైతే, ఈ కౌరవులతో నేను యుద్ధంచేస్తాను. నా రథం నడుపు, చాలు! నీకు ఏ అపాయమూ కలగకుండా నేను రక్షిస్తాను!" అంటూ అర్జునుడు ఉత్తరుణ్ణి తెచ్చి రథంలో కూచోబెట్టాడు.



# మూగవాడు

[గత సంచిక తరువాయి]

రాజుగారు దైవజ్ఞులను పిలిపించి, "నాకు కుమారుడు కలిగినప్పుడు అతనిలో అనేక శుభలక్షణాలున్నాయనీ, అరిష్టాలేమీ రావనీ మీరు చెప్పారు. నా కొడుకు అవిటి వాడు, పుట్టు చెవిటి, పుట్టు మూగ! మీ మాటలు అక్షరాలా అబద్ధమయాయి. దీని కేమంటారు?" అని అడిగాడు.

"మహారాజా, మీరు ఎన్నో వ్రతాలు చేసి లేక లేక కొడుకును కని ఆనందంలో ఉన్న సమయంలో ఆ కొడుకు అదృష్టహీనుడని చెప్పటానికి మాకు నోరు రాలేదు. అందు చేత అబద్ధం చెప్పాం!" అన్నారు దైవజ్ఞులు.

"అయితే ఇప్పుడేం చెయ్యాలి?" అన్నాడు రాజు.

"అయ్యా, ఈ కుర్రవాడు జీవించి ఉండటంవల్ల మీకూ మీ రాజ్యానికీ, మహా రాణీగారికీ అపద తప్పదు. అందుచేత, అశుభప్రదమైన తేరుకు, అశుభ లక్షణాలు గల గుర్రాలను కట్టి, అందులో ఈ కుర్ర వాణ్ణి పెట్టి, పడమటి ద్వారంగుండా శ్మశానానికి తీసుకుపోయి అక్కడ పాతి పెట్టించండి!" అన్నారు దైవజ్ఞులు.

అపాయాలకు వెరిచి రాజు అలాగే చేయించమన్నాడు. ఈ సంగతి విని చంద్రా దేవి రాజువద్దకు వెళ్లి, "మహారాజా, నా కొక వరం ఇస్తానని వెనక వాగ్దానం చేశారు. ఇప్పుడా వరం ఇవ్వండి," అన్నది. రాజు సరే నన్నాడు. "అయితే నా కొడుకుకు రాజ్యాభిషేకం చెయ్యండి!" అన్నది రాణి.

"అది సాధ్యమయే పని కాదు. నీ కొడుకు అరిష్టజాతకుడు!" అన్నాడు రాజు.

"యావజ్జీవం కాకపోయినా ఏడేళ్లపాటు రాజ్యం చేయనివ్వండి," అన్నది రాణి. రాజువల్లకాదన్నాడు. అఖరుకు ఏడురోజుల పాటు రాజు చెయ్యటానికి ఒప్పుకున్నాడు.





ఈ విధంగా ఆరు రోజులు గడిచాయి. రాజు తన సారథి అయిన సునందుణ్ణి పిలిచి, "రేపులోపల అశుభప్రదమైన రథానికి అశుభ లక్షణాలు గల గుర్రాలను పూన్చి సిద్ధంచెయ్యి. తరవాత తేమియుణ్ణి అందులో పెట్టుకుని పడమటి ద్వారంకుండా శ్మశానానికి తీసుకుపో. అక్కడ నలచదరంగా ఒక గొయ్యి తవ్వి, అందులో తేమియుణ్ణి పడవేసి పూడ్చి, స్నానంచేసి తిరిగి రా!" అని ఆజ్ఞాపించాడు.

అఖరు రాత్రి చంద్రాదేవి తన కొడుకు మీద పడి ఏడుస్తూ, "రాజుగారు నీ మరణానికి ఉత్తరువిచ్చాడు. నీ అయువు రేపటితో మూడింది, తండ్రీ!" అని ఏడ్చింది.

ఈ మాట వినగానే బోధిసత్వుడికి పరమానందమయింది. "పదహారేళ్లు నేను చేసిన కృషి ఫలించబోతున్నదిగదా!" అనుకున్నాడు. తన తల్లి గుండె పగిలి ఏడుస్తున్నదని తెలిసికూడా ఆమెను ఊరడించటానికైనా అతను నోరు విప్పలేదు.

తెల్లవారుతూనే సారథి సునందుడు తేరు సిద్ధంచేసి తెచ్చి తలవాకిట నిలబెట్టి లోపలికి వచ్చి, రాణితో, "అమ్మా, తమకు తెలియనిదేమున్నది? రాజాజ్ఞ నిర్వర్తించాలి!" అన్నాడు. చంద్రాదేవి తన కుమారుడిపై

చంద్రాదేవి వెంటనే తన కుమారుడికి తగిన వస్త్రాభరణాలు తొడిగించింది. నగరమంతా అలంకరించి, ఆ రోజునుంచీ తేమియ మహారాజు పరిపాలన ఆరంభమవుతున్నదని చాటింపువేశారు.

ఆ రాత్రి యావత్తూ చంద్రాదేవి తన కొడుకుదగ్గిర కూచుని, "నాయనా, నీకోసం పదహారేళ్లపాటు నేను కన్ను మూయలేదు. ఏడ్చి ఏడ్చి నా కళ్లు కాయలు కాశాయి. నువు అవిటివాడివి కావు, నాకు తెలుసు. నాకోసమైనా లేచి తిరుగు, నాయనా!" అని ఎంతో బతిమాలింది. కాని తేమియుడిలో చైతన్యం లేదు.





బడి ఏడవసాగింది. సారథి తేమియుణ్ణి తన చేతులతో ఎత్తుకుని తేరులో పెట్టి, పడమటి ద్వారానికే పోతున్నాననుకుంటూ తూర్పు ద్వారంకేసి వెళ్ళాడు.

తూర్పుద్వారం దాటి తేరు మూడు యోజనాలు వెళ్ళేవాకా ఆగలేదు. అక్కడ సునందుడికి ఒక అడవీ, దాని సమీపంగా రుద్రభూమీ ఉన్నట్టు భ్రమ కలిగింది. వెంటనే అతను రథం దిగి, తేమియుడి నగలు వొలిచి మూటగట్టి, ఒకచోట నలచదరంగా గుంట తవ్వనారంభించాడు.

"పదహారేళ్ళుగా చలనం లేని నా అవయవాలకు ఇప్పుడు పని తగిలింది," అనుకుంటూ బోధిసత్వుడు లేచి నిలబడి తన చేతులను రుద్దుకున్నాడు, చేతులతో రెండు కాళ్ళూ రుద్దుకున్నాడు, తేరునించి దిగి అటూ ఇటూ నడిచి చూసుకున్నాడు. తన కేమాత్రం బలం ఉన్నదో చూడటానికి తేరును వెనకనుంచి పట్టుకుని ఎత్తాడు. అది చెండులాగా లేచింది.

తరవాత అతను గుంట తవ్వే సునందుడితో, "ఏమోయ్, అంత శ్రద్ధగా గుంట తవ్వుతున్నావు; ఎందుకేమిటి?" అన్నాడు.

"మారాజుగారి కొడుకు వెర్రిబాగులవాడు, వికలాంగుడు, మూగి, చెవిటి. అందుచేత ఇక్కడ గుంట తవ్వి పూడ్చి రమ్మన్నారు!" అన్నాడు సునందుడు, వెనక్కు తిరిగి చూడకుండానే.

"సరిగా చూడు. నేను వికలాంగుణ్ణి కాను, చెవిటివాణ్ణీ కాను. నన్ను పాతేస్తే నీకు మహాపాతకం చుట్టుకుంటుంది!" అన్నాడు బోధిసత్వుడు. సారథి తల పైకెత్తి రాజకుమారుణ్ణి చూసి నిర్ఘాంతపోయి, "మీరెవరు, బాబూ? మీ పేరేమిటి? మీ తండ్రిగారి పేరేమిటి?" అన్నాడు.

బోధిసత్వుడు నిజమే చెప్పాడు, కాని సారథి నమ్మలేకపోయాడు. అతను తేరు వద్దకు వెళ్ళి, అందులో రాజకుమారుడు



19





గాని, అతని నగలు గాని, లేకపోవటం చూసి, ఆ తరవాత నిజం తెలుసుకుని, బోధిసత్వుడి కాళ్ళమీద పడి, "మహారాజా, ఇలా అయితే మీరీ దిక్కుమాలిన అడివికి రావటం దేనికి ? నగరానికి పదండి, హాయిగా రాజ్యం చేద్దురుగాని !" అన్నాడు.

"నాకు రాజ్యమూ, వైభవమూ వద్దు. వాటికోసమై నేను ఎన్నో పాపాలు చేయవలసి ఉంటుంది," అన్నాడు బోధిసత్వుడు.

"అలాకాదు, మహారాజా! మిమ్మల్ని తీసుకువెళితే మీ తండ్రిగారూ, తల్లిగారూ, ప్రజలూ ఎంతో ఆనందించి నాకు అంతులేని బహుమానాలిస్తారు!" అన్నాడు సారథి.

"పిచ్చివాడా, నాకిక ఎవరి సంతోషంతోనూ పనిలేదు. ఈరోజు నా జన్మ తరించింది! నేను సంపూర్ణ మానవుణ్ణి అయాను!" అన్నాడు బోధిసత్వుడు.

"అయితే తమరు ఇంత కాలమూ మూగగా, చెవిటిగా ఎందుకు నటించారు, మహారాజా ?" అని అడిగాడు సారథి.

"ఒకప్పుడు నేను రాజరికమూ, ఆ తరవాత ఘోర నరకమూ అనుభవించిన వాణ్ణి. మళ్ళీ రాజరికం సంప్రాప్త మవుతుందన్న భయంతో నా నోరు కట్టుబడింది. నేను వింటుండగా నా తండ్రి నిర్దయగా నలుగురికి క్రూరమైన శిక్షలిచ్చాడు. ఆ తరవాత నాకు చెవులు పోయినట్టే అయింది; నేను వెర్రిబాగులవాణ్ణి అయిపోయాను. ఈ జీవితం బుద్బుదప్రాయమూ, దుఃఖమయమూ అని గ్రహించినవాడు దీనికోసం ఇంకొకడిపై ఆగ్రహిస్తాడా? దీనికోసం ఇంకొకణ్ణి దండిస్తాడా? ఈపాటి సత్యం తెలియక మానవులు అజ్ఞానంలో పడిపోతారు గాని!" అన్నాడు బోధిసత్వుడు.

అప్పుడు సారథి, "మహారాజా, నన్ను కూడా మీతో రానివ్వండి!" అన్నాడు.

"అలాకాదు. ఈ తేరు రాజుగారిది. దాన్ని రాజుగారికి వప్పగించు. నీ రుణాను



బంధా లేవేవైతే ఉన్నాయో, అన్నీ కడిగేసు కుని సన్యాసం పుచ్చుకో. అంతదాకా నువ్వు స్వతంత్రుడివి కావు!" అన్నాడు బోధిసత్వుడు.

తాను నగరంలోకి వెళ్ళిపోగానే రాజ కుమారుడు తన దారిన అరణ్యంలోకి వెళ్లి పోతాడని భయపడి సారథి, "స్వామీ, నేను తిరిగి వచ్చేదాకా ఇక్కడే వుంటానని మాట ఇయ్యండి. రాజుగారిని తీసుకు వస్తాను. ఆయన మిమ్మల్ని చూసి చాలా ఆనంద పడతారు!" అన్నాడు. బోధిసత్వుడు అతను కోరిన ప్రకారం అక్కడే ఉంటానని మాట ఇచ్చాడు. సారథి అతని పాదాలు కళ్ళకు అద్దుకుని బయలుదేరాడు.

తన కుమారుడు లేకుండా తేరు తిరిగి వస్తూవుండటం చంద్రాదేవి కిటికీలోనుంచి చూసి భోరున ఏడ్చింది. ఆమె సారథిని పిలిపించి, "ఏం, నాయనా, నా కొడుకు ఆఖరు క్షణంలోనైనా నోట ఒక్కమాట పలకలేదా? వాడు కాళ్ళూ చేతులూ తన్నుకోలేదా?" అని అడిగింది.

"ఆయన మూగవాడూ అవిటివాడూ ఎందుకయినాడు, తల్లీ? రాజరికానికి భయ పడి అలా నటించాడు! ఆయన గొంతు కంచుగొంతు! ఏమి తెలివైన మనిషి! మన



లాగా బతకటం ఇష్టంలేక దివ్యమైన మార్గం తొక్కాడు. ఎందుకూ? మీరే చూస్తారుగా!" అంటూ సారథి జరిగినదంతా చంద్రాదేవికి చెప్పాడు. ఆవిడ దుఃఖాశ్రువులు ఆనందా శ్రువులుగా మారాయి. ఆమె వెంటనే ఈ సంగతి రాజుకు తెలిపింది.

రాజుకు కాలు నిలపలేదు. తన కుమా రుణ్ణి చూడటానికి ఆయన బ్రహ్మాండమైన పరివారాన్ని పోగుచేసి బయలుదేరాడు. వారంతా వచ్చి చేరేలోగా ఇంద్రుడు బోధి సత్వుడికి ఒక మంచి పర్ణశాల నిర్మించ మని విశ్వకర్మను ఆజ్ఞాపించాడు. రాజు సపరివారంగా ఈ పర్ణశాలవద్దకే వచ్చాడు.





బోధిసత్వుడు తన తండ్రికోసం ఒక ఆసనం వేయించాడు. కాని రాజు దానిపై కూచోక, కొడుకుపైగల గౌరవభావం కొద్దీ కిందనే కూచున్నాడు. ఆయన తన కొడుకును ఎలాగైనా తీసుకువెళ్ళాలనే ఉద్దేశంతో, "నాయనా, నీకీ పర్ణశాల ఏమిటి? కటికనేలమీద పడుకోవటమేమిటి? ఆకులూ అలములూ తినటమేమిటి? బోలెడన్ని సౌధాలున్నాయి, దాసదాసీ జనం వున్నారు, రాజ్యం ఉన్నది. వచ్చి హాయిగా ఏలుకో!" అన్నాడు.

"నువు చెప్పేవన్నీ మాసిపోయే సుఖాలు. నాకు వాటితో పనిలేదు. మనం రాజ్యాలను గురించీ, సింహాసనాలను గురించీ ఆలోచిస్తూనే వుంటాం. మనకోసం ఒకటి పొంచి వుంటుంది, ఒకటి తన పని తాను చేసుకుపోతూంటుంది, మూడవది అదను కనిపెట్టి వేటు వేస్తుంది. పొంచివుండేది వృద్ధాప్యం; తనపని తాను చేసుకుపోయేది కాలం; వేటు వేసేది మృత్యువు," అన్నాడు బోధిసత్వుడు.

"నీ మాటలు వింటూంటే నాకు జీవితం మీద రోత పుడుతున్నది. నాకు రాజ్యం వద్దు. నేను తపస్సు చేసుకుంటాను. నువు నా బదులు రాజ్యం ఏలు!" అన్నాడు రాజు.

"అన్నీ త్యజించినవాడికి నాకు నీ రాజ్యంమటుకు దేనికి?" అంటూ బోధిసత్వుడు అక్కడ చేరిన వారందరికీ జీవిత పరమార్థం గురించి బోధ చెయ్యసాగాడు. అతని బోధలు వినటానికి నగరం యావత్తూ కదిలి వచ్చింది. కాలక్రమాన అందరూ సన్యసించి నగరాన్ని పాడుపెట్టేశారు.

కాశీరాజు సన్యసించాడని తెలియగానే బోధిసత్వుడి బోధలు వినటానికి మరొక రాజు వచ్చాడు. ఆయన వెంట ప్రజలుకూడా వచ్చారు. ఈ విధంగా మూడు రాజ్యాలు పాడుపడిపోయాయి. ఆ రాజ్యాలలో వున్న జంతువులన్నీ వన్యమృగాలుగా మారాయి. అక్కడి నగరాలలోని సంపదకు మట్టికున్న విలువకూడా లేకుండా పోయింది.






## 13

[పింగళుడి అన్నలు ఇంట్లోవున్న డబ్బును పంచుకుని, మహత్తుగల సంచీ ఎవరిభాగానికి రావాలనే దగ్గిర పేచీపడి కొట్లాడుకోసాగారు. ఈ సంగతి రాజుకు తెలిసి వాళ్ళిద్దర్నీ జైలులో పెట్టించాడు. ఇక పింగళుడున్న ఓడకూ, మరో ఓడకూ మహాసముద్రం మీద యుద్ధం ప్రారంభమయింది. సరంగు, బానిసలను విడిపించి, వాళ్లకు ఆయుధాలిచ్చాడు. తరవాత—]

సరంగు అజ్ఞకాగానే గొలుసులకు బంధింపబడివున్న బానిసలందరూ విడిపించబడ్డారు. వారిలో ప్రతిఒక్కరికీ కత్తీ, విల్లమ్ము యివ్వబడింది. ఆ సమయంలో సరంగు వాళ్లమీద ఎక్కడ లేని అప్యాయతా కనబరుస్తూ, "మీరు యీ క్షణంనుంచీ బానిసలు కారు; యోధులు! మన ఓడ పెద్ద అపాయంలో చిక్కుకున్నది. మన ఓడను వశపరుచుకో చూస్తున్న ఆ శత్రుఓడకు మనం లొంగిపోయామంటే, ఆ తరవాత బతికివున్నన్నాళ్లూ వాళ్లకు మనం బానిస వృత్తి చేస్తూ జీవించవలసి వస్తుంది. అలా కాక మనం జయిస్తే అందరం స్వేచ్ఛగా కాలం గడపవచ్చు. కనక, ప్రాణరక్షణ కోసం, స్వతంత్రం కోసం తెగించి పోట్లాడండి," అన్నాడు.

సరంగు మాటల్లో బానిసలకు నమ్మకం కుదరలేదు. అతడు తమనెంత క్రూరంగా హింసించాడో వాళ్లల్లో ప్రతి ఒక్కరూ గుర్తుపెట్టుకునే వున్నారు. అయినా యీ తరు



ణంలో చేయవలసిందేమిటి? శత్రుఓడలోంచి ఎడతెరిపి లేకుండా బాణాలూ, అగ్నిగోళాలూ వచ్చి తమ ఓడమీద పడుతున్నవి. ఓడ నిప్పంటుకుని కాలి మునిగిపోతే, దానితో పాటు తామూ సర్వనాశం కాకతప్పదు.

బానిసల మనసుల్లో కదుల్తున్న యీ అనుమానాలూ, సంశయాలూ పింగళుణ్ణి కూడా బాధించినై. కాని, అతడు వెంటనే ఒక నిర్ణయానికి వచ్చాడు. తాము వున్న ఓడ నీట మునగకుండా రక్షించవలసిన అవసరం వుంది. కాని, అతి క్రూరుడైన సరంగుమాత్రం బతికివుండటం ప్రమాదకరం. ముందు అతణ్ణి తుదముట్టించాలి. తరవాత వీలుచూసుకుని శత్రుఓడలోని వారితో రాజీపడి తమ దారిన తాము పోవాలి.

పింగళుడు యిలా ఆలోచించి, తన తోటి బానిసలకు కర్తవ్యం ఏమిటో తెలియబరిచాడు. ప్రస్తుతానికి ఆ శత్రుఓడ సంగతి మరిచిపోయి, ముందు తమ ఓడ సరంగునూ, అతడి అనుచరులనూ తుదముట్టించటం క్షేమమని చెప్పాడు. బానిసలందరూ యిందుకు ఒప్పుకున్నారు. యువకుడూ, తెలివిగలవాడూ, సాహసీ అయిన పింగళుడి నాయకత్వాన్ని వాళ్లు అంగీకరించారు.

పింగళుడు వెంటనే సముద్రం మారు మోగేలా అరుస్తూ, "సరంగునూ, వాడి అనుచరులనూ హతమార్చండి, రండి!" అంటూ ముందుకు దూకాడు.

బానిసలందరూ ఒకేసారి సింహాల్లా గర్జిస్తూ తమను హింసలపాలు చేసిన సరంగు మీదా, అతడి అనుచరులమీదా కత్తులు దూసి దూకారు. పరిస్థితి యిలా విషమంగా పరిణమిస్తుందని సరంగు వూహించలేదు. ఒకవైపునుంచి శత్రుఓడ నిప్పులు చెరుగుతూ వస్తున్నది. అదే సమయంలో తన ఓడలోని బానిసలు తనమీద కత్తులు దూశారు.

సరంగుకు ఆలోచించేందుకు వ్యవధి లేదు. అతడు తన అనుచరులకు ఆజ్ఞలు





యిచ్చేలోపతే బానిసలు వారిమీద పడి కత్తులతో వాళ్లను ముక్కలుగా నరికేస్తున్నారు. "ద్రోహం, మోసం! ముందు యీ బానిసలను యమపురికి పంపండి!" అంటూ సరంగు భీకరంగా అరిచి వాళ్లమీద పడ్డాడు. బలశాలీ, జిత్తులమారీ అయిన సరంగు కత్తిదెబ్బకు కనుమూసి తెరిచేంతలో అయిదారుగురు బానిసలు అహుతి అయారు. అది చూసిన కొందరు బానిసలు భయకంపితులై వెనక్కు పారిపోసాగారు.

పింగళుడు ప్రమాదం గుర్తించాడు. వెంటనే అతడు కత్తి పైకెత్తి సరంగుకేసి లంఘిస్తూ, పారిపోతున్న బానిసలను హెచ్చరించాడు. "సరంగును ఒక్క క్షణంలో నా కత్తికి ఎరచేస్తాను. మీరు ప్రాణభయంతో పారిపోయినా, మిమ్మల్ని సముద్రం పొట్టను పెట్టుకోక మానదు. మీ స్వేచ్ఛకొరకు తెగించి పోరాడండి!"

పింగళుడి మాటలు పారిపోతున్న బానిసలలో తిరిగీ ధైర్యోత్సాహలను కలిగించినై. యీలోపల పింగళుడు కొదమసింహంలా గర్జిస్తూ, సరంగును ఎదుర్కొన్నాడు. అతడు తొలిసారిగా విసిరిన కత్తిదెబ్బ, సరంగు గుండెలను రాచుకుంటూ పోయింది. సరంగు "హా, భైరవీ!" అంటూ గుండెమీద చేయి నొక్కిపట్టి, నిప్పులు చెరిగే కళ్లతో పింగళుడిమీదికి కత్తి ఝుళిపిస్తూ వురికాడు.

సరంగు దేహబలం, కత్తియుద్ధంలో అతడి నేర్పూ చూసిన పింగళుడు, చప్పున పక్కకు తప్పుకున్నాడు. సరంగు ఆ ఆవేశంలో పింగళుడు తన కత్తిదెబ్బకు అందకపోగా, ముందుకు తూలి ఒక తాడు కాలికి చుట్టుకునేసరికి బోర్లాపడిపోయాడు. పింగళుడికి యిది మంచి అవకాశం యిచ్చింది. అతడు భీకరంగా అరుస్తూ, సరంగు వీపుమీద కత్తిని గుచ్చబోయాడు. కాని, సరంగు తనకు రానున్న ప్రమాదాన్ని గ్రహించి చటుక్కున పక్కకు దొర్లాడు.



పింగళుడి కత్తి అక్కడ వున్న కొయ్యలో బలంగా గుచ్చుకుని తపీమని మధ్యకు విరిగిపోయింది.

సరంగు వికటాట్టహాసం చేశాడు. "ఓహో, నువ్వు బానిసల నాయకుడివి గామోలు! నాయకుడు ఎంత ప్రమాదంలో చిక్కుకుపోయాడు! యీ కత్తితో నిన్ను ముక్కలు ముక్కలుగా నరికి సముద్రం పాలు చేస్తాను. తరవాత నీ అనుచరులందర్నీ ..."

సరంగు ఒళ్లుతెలియని ఆవేశంలో వుండి, పింగళుడు ఏమి చేస్తున్నదీ గమనించలేదు. తన కత్తి విరిగిపోగానే పింగళుడు రానున్న ప్రమాదాన్ని వెంటనే గ్రహించాడు. మరో కత్తి దొరకపుచ్చుకునేందుకు అందుబాటులో ఎక్కడా లేదు. తన అనుచరులైన యితర బానిసలు సరంగు అనుచరులతో పోరాడుతున్నారు.

పింగళుడు మెరుపులా పక్కన పడివున్న తాడు నొకదానిని చేతికి తీసుకుని, దాని కొసను వుచ్చులా బిగించి, సరంగుకోసం సర్వసిద్ధంగా వున్నాడు. ఒళ్లుమరిచిన ఆవేశంలో సరంగు అరుస్తూ కత్తితో ముందుకు దూకబోయేంతలో, పింగళుడి చేతనున్న తాడు గిర్రున తిరుగుతూ పోయి, సరంగు గొంతుకు వుచ్చు బిగుసుకున్నది. వెంటనే



పింగళుడు తన చేత గల తాడును గట్టిగా గుంజుతూ వెనక్కు పరిగెత్తాడు.

సరంగు పెద్దగా ఓంగ్రపెట్టి, మానులా దభీమని ముందుకు పడిపోయాడు. కాని, అతడు తన చేతి కత్తితో తాడును కోసేందుకు ప్రయత్నించాడు. అది గమనించిన పింగళుడు వెనక్కు తిరిగి తన అనుచరులను కేకవేశాడు. వెంటనే యిద్దరు బానిసలు పరిగెత్తుతూ వచ్చి, సరంగు కింద పడి వుండటం చూస్తూనే అతడిమీదికి వురికి, తమ కత్తులతో తూట్లుపడేలా పొడిచారు.

సరంగు మరణంతోగాని పింగళుడికి తన చుట్టూ ఏమి జరుగుతున్నదీ చూసే అవకాశం కలగలేదు. అతడు ఒక బానిసవద్ద నుంచి కత్తి తీసుకుని, ఓడలో ఒకమూల జరుగుతున్న పోరాటంకేసి పరిగెత్తాడు. అతడు ఆ ప్రాంతానికి చేరేసరికి, కొద్దిగా మిగిలివున్న సరంగు అనుచరులుకూడా చంపబడటమో, గాయపడి ఖైదీలుగా దొరకటమో జరిగిపోయింది.

ఈ లోపల శత్రుఓడలోని సైనికులు కోలాహలంగా అరుస్తూ, పింగళుడున్న ఓడను సమీపిస్తున్నారు. వాళ్ళు విధీ విరామం లేకుండా ఓడమీదికి బాణాలు వదలటం మాత్రం మానలేదు. తమ శత్రుఓడలో ఏదో కలహం ప్రారంభమయిందనీ, యిదే అద







నుగా తాము దాన్ని వశపరుచుకోవచ్చునీన వాళ్లు భావించారు.

పింగళుడికి ఏమి చేసేందుకూ పాలుపోలేదు. ఆ శత్రుఓడతో పోరాడటం తన వెంటవున్న కొద్దిమంది అనుచరులవల్లా సాధ్యమయేది కాదు. అలా కాదని దానికి లొంగిపోతే, వాళ్ళు తిరిగీ తమను బంధించి, తమచేత బానిసవృత్తి చేయించవచ్చు. అసలు శత్రుఓడలో వున్న నావికులెందరు?

పింగళుడు, సరంగునుంచి లాక్కున్న దుర్భిణీలోంచి శత్రుఓడకేసి చూశాడు. ఓడ అంతా నావికులతో కిటకిటలాడి పోతున్నది. ఇక వాళ్ళతో పోరాడి లాభం లేదని పింగళుడు గ్రహించాడు. ముందు తన ఓడమీద తెల్లజెండా ఎత్తి, తమ పరిస్థితిని ఆ ఓడలోనివారికి తెలియపరిచి, రాజీమార్గంగా ఎవరిదారిన వాళ్ళు పోవటం ఒక్కటే మంచిమార్గంగా అతడికి తోచింది. కాని, వాళ్లు అందుకు అంగీకరిస్తారా?

తమ ఓడమీదికి శత్రునావికులను రానీయకుండా, ఆ ఓడను అంతదూరాన వుంచి రాజీరాయబారాలు నడపటం క్షేమమని పింగళుడు నిర్ణయించుకున్నాడు. వెంటనే అతడి ఆజ్ఞప్రకారం ఓడకొయ్యకు తెల్లజెండా ఎత్తబడింది. మరుక్షణం శత్రు ఓడలోంచి విజయధ్వానాలు వినబడినై.

పింగళుడు పెద్దబూరలాంటి సాధనం లోంచి, శత్రుఓడలోనివారితో, తన ఓడలో జరిగినదానిని గురించి చెప్పాడు. " మీ ఓడను అటకాయించి, వశపరుచుకోవాలని చేసిన ప్రయత్నంతో మాకెవరికీ సంబంధంలేదు. బానిసలమైన మేమందరమూ, క్రూరుడైన మా యజమాని సరంగునూ, అతడి అనుచరులనూ హతమార్చాము. ఇక యిప్పుడు మేము కోరేదల్లా మా ఓడను ఏదో ఒక రేవుకు నడిపి, అక్కడినుంచి ఎవరెవరి దేశాలకు వాళ్లం వెళ్లిపోవటం. కనక, మీరు రాజీపడి మా జోలికి రాక, సముద్రంమీద





మీ దారిన మీరు వెళ్ళవలసిందిగా కోరు తున్నాము," అన్నాడు పింగళుడు.

ఈ మాటలు వింటూనే శత్రుఓడలో గందరగోళం బయలుదేరింది. కొంచెంసేపు తరవాత అది సర్దుమణగ్గానే, భీకరమైన ఒక గొంతు యిలా అరిచింది :

"బానిసలైన మీకు స్వేచ్ఛగా మహా సముద్రాలమీద ఓడను నడిపే హక్కు లేదు. పైగా యజమానినీ అతడి అనుచరులనూ చంపటంద్వారా మీరు క్షమించరాని నేరం చేశారు. అందుకు మీరు శిక్ష అనుభవించ వలసిందే. లేకపోతే, మీనుంచి పాఠం నేర్చుకుని, మా ఓడలోని బానిసలుకూడా ఒకానొక రోజున మమ్మల్నందర్నీ తుద ముట్టించవచ్చు. ఓడకు లంగరు దించి, కిమ్మనకుండా మాకు లొంగిపోండి!"

ఈ మాటలు వింటూనే పింగళుడు నిర్వణ్ణుడయిపోయాడు. అది వర్తకపు ఓడ ముసుగులో దాగివున్న సముద్రపు దొంగల ఓడ అని అతడికి అర్థమైపోయింది. అలాంటి ఓడలోని వారికి తనూ, అనుచరులూ లొంగట మంటే, తిరిగి తామందరూ బానిసలుగా అమ్ముడుపోవటమే నన్నమాట.

ఒకటి రెండు మాటల్లో పరిస్థితి నంతా పింగళుడు తన అనుచరులకు చెప్పాడు.




వారిలో ప్రతిఒక్కరూ పోరాడటానికే సిద్ధ మన్నారు. లొంగిపోయి జీవితమంతా బాని సలుగా బతకటంకన్న, పోరాడుతూ మర ణించి సముద్రంపాలు కావటం వుత్తమం అని వాళ్ళు ఏకకంఠంగా జవాబిచ్చారు.

వెంటనే ఓడ స్తంభంమీంచి తెల్లజండా దించబడింది. ఓడలోంచి జయజయ ధ్వానాలు మిన్ను ముట్టినై. సంఖ్యాబలంలో అధికులైన శత్రు సైనికులు, ఒకసారి తన ఓడలోకి ఎక్కగలిగితే, యిక తను చేయ గలిగిందేమీ లేదు. కనుక, సాధ్యమైనంత వరకూ శత్రుఓడకు దూరంగా వుండి బాణాలతో యుద్ధం చేస్తూ, యిక తప్పనిసరి



అయితే, తన ఓడతో శత్రుఓడను ఢీకొట్టా లని పింగళుడు నిర్ణయించుకున్నాడు.

తిరిగి యుద్ధం ప్రారంభమయింది. పింగళుడి అనుచరులు బాణాలు ఎక్కుపెట్టి శత్రుఓడమీదికి వదులుతున్నారు. పింగళుడు ఓడను వెనక్కు నడపమన్నాడు. సాధ్యమైతే, పోరాడుతూనే తనఓడను శత్రుఓడకు అందకుండా నడిపించుకు పారిపోవాలని కూడా పింగళుడు నిర్ణయించుకున్నాడు. కాని, శత్రుఓడనుంచి పారిపోవటం సాధ్యమయే పని కాదని కొద్దిసేపట్లోనే తేలిపోయింది. చూస్తూండగానే ఆ ఓడ బహు వేగంగా ముందుకు రాసాగింది.

పింగళుడు చటుక్కున ఒక నిర్ణయానికి వచ్చాడు. విజయమో, వీరస్వర్గమో— అంతకన్న మార్గం లేదు. ఓడను వేగంగా ముందుకు నడిపి, శత్రుఓడను ఢీ కొట్టవలసిందిగా అతడు తన అనుచరులను ఆజ్ఞాపించాడు. వెంటనే ఓడ ముందుకు కదలసాగింది. మొదట ఆశ్చర్యపడి, అంతలోనే పింగళుడు తలపెట్టిన దేమిటో గ్రహించిన శత్రుసైనికులు భయంతో కంపించిపోయి, ఒక్కసారిగా హాహాకారాలు చేశారు.

ఓడను వెనక్కు నడపటంద్వారా ప్రమాదాన్నుంచి బయటపడేందుకు శత్రుసైనికులు చేసిన ప్రయత్నం ఫలించలేదు. పింగళుడు కత్తి ఝళిపిస్తూ, తన అనుచరులకు ఓడను వేగంగా ముందుకు నడిపి శత్రుఓడను ఢీకొట్టవలసిందిగా హెచ్చరిస్తున్నాడు. చూస్తూండగానే ఓడ మహా వేగంతో ముందుకు కదిలి, శత్రుఓడను తాకింది. ఆ మరుక్షణంలో వేయి గొంతులు కలిసికట్టుగా చేసిన ఆర్తనాదం సముద్రం మీద మారుమోగింది. రెండు ఓడలూ ఢీకొనటంలో కలిగిన తాకిడికి, పింగళుడు తను వున్న చోటునుంచి గాలిలోకి ఎగిరి, గిరవాటు వేసినట్టు దూరంగా సముద్రంలో పడిపోయాడు. —(ఇంకా వుంది)





# వేదాంతీ - భక్తుడూ

పట్టుదలతో విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుమీదినుంచి శవాన్నిదించి భుజాన వేసుకుని, శ్మశానంకేసి మౌనంగా నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అపరాత్రివేళ చాలా శ్రమపడిపోతున్నావు. నీకు శ్రమ తెలియ రాకుండా ఉండటానికి ఒక చిన్న కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

పూర్వం సుబుద్ధి అనే వేదాంతి ఉండే వాడు. ఆయన తాత్విక విషయాలను గురించి ఎంతో గొప్ప పరిశోధనలు చేసిన వాడు. ఆయనకు వేదాంతంపైన తప్ప ఇక దేనిమీదా ఆసక్తి లేని కారణంచేత పెళ్ళి కూడా చేసుకోక, కాశీ వెళ్ళి, అక్కడ స్థిరనివాసం ఏర్పాటు చేసుకుని, వేదాంత గ్రంథాలు చదువుతూ, స్వయంగా రాస్తూ కాలం గడపసాగాడు.

## బేతాళ కథలు

ఇలా ఉండగా కాశీనగరానికి వంగదేశం నుంచి కృష్ణదాసనే ఆయన తన కుమార్తెతో కూడా వచ్చాడు. కృష్ణదాసు భార్య కొద్ది రోజులక్రితం చనిపోయింది. ఆవిడ అస్థికలను గంగలో కలపటానికిగాను తన కుమార్తె సుగుణతో సహా స్వగ్రామంనుంచి వచ్చాడు. సుబుద్ధి ఇంటికి సమీపంలోనే ఉన్న సత్రంలోనే ఆయనా, ఆయన కుమార్తె బసచేశారు.

కృష్ణదాసు వచ్చిన పని అయిపోయింది. ఆయన తన గ్రామానికి వెళ్లిపోదామనుకుంటుండగా పెద్దపెట్టున జబ్బు చేసింది. సత్రంలో ఆయనకు సౌకర్యం లేకపోయింది. సుబుద్ధికి ఈవార్త తెలిసింది. ఆయన సత్రానికి వెళ్లి కృష్ణదాసునూ ఆయన కుమార్తెనూ తన ఇంట వచ్చి ఉండమనీ, చికిత్స చేయించుకోమనీ ఆహ్వానించాడు. వారు ఆ ప్రకారమే చేశారు.

సుబుద్ధి ఒక వైద్యుణ్ణి పిలిపించాడు. ఆయన కృష్ణదాసుకు ఇచ్చిన మందు పంట పట్టి పనిచేసింది. కొద్ది రోజులలోనే వ్యాధి తిరుగుముఖమయింది.

ఈలోపుగా సుబుద్ధికి కృష్ణదాసును గురించీ, ఆయన కుమార్తె సుగుణను గురించీ చాలా విషయాలు తెలిశాయి. కృష్ణదాసు గొప్ప భక్తుడు. ఆయన ఎప్పుడూ



దైవధ్యానం చేసేవాడు. సుగుణకు తండ్రి మీద అపారమైన ప్రేమ. ఆమె స్వభావం చాలా మంచిది. అటువంటి ఆడవాళ్లు ఉంటారని సుబుద్ధి కలలోకూడా అనుకోలేదు. ఎన్నడూ ఎటువంటి సంసారతాపత్రయమూ కోరని సుబుద్ధి, తనకే అలాటి కుమార్తె ఉంటే ఎంత బాగుండేది అని ఎన్నోసార్లు అనుకున్నాడు.

కృష్ణదాసు మంచంలో లేచి కూచునే శక్తి వచ్చినది లగాయతు దైవప్రార్థనా, దైవస్మరణా సాగించాడు.

"దేవుడికి నాపట్ల ఎంతో దయ! ఆయన దయామృతం మనమీద పడకపోతే మన

జీవితాలు ఏం కాను? మహత్తరమైన ఈ సృష్టిలో మనం ఏపాటి ప్రాణులం! మన జీవితాలకు సార్థక్యం ఏర్పడేది ఆ భగవంతుడి కృపఉంటేనే! నా భార్య మరణం నా కెటువంటి దెబ్బో చెప్పలేను. నాకు నా భార్య, ఈ పిల్లా తప్ప ప్రపంచంలో మరెవరూ లేరు. ఆ ఈశ్వరుడి అనుగ్రహం ఉండబట్టే నేనీ దెబ్బకు తట్టుకోగలిగాను! వాడే నాకా శక్తి ప్రసాదించాడు!" అని కృష్ణదాసు అనటం ప్రారంభించాడు.

కృష్ణదాసు ఈ విధంగా మాట్లాడటం మొదలుపెట్టినప్పుడూ, తండ్రి కూతుళ్లు కలిసి దైవభజనగీతాలు పాడసాగినప్పుడూ, సుబుద్ధి ఏదో వంకపెట్టి ఇంట్లోనుంచి బయటికి వెళ్లిపోయేవాడు.

మొదట్లో కృష్ణదాసుకు సుబుద్ధి ప్రవర్తన అర్థంకాలేదు. కాని ఆయన నిరీశ్వరవాది అనీ, నాస్తికుడనీ తరవాత తెలిసింది. ఆయన తన కుమార్తెతో, "అమ్మా, ఈ సుబుద్ధి నాస్తికుడైనప్పటికీ చాలా యోగ్యుడు. నాస్తికులలో అయోగ్యులున్నారు, యోగ్యులున్నారు. ఎంతో జ్ఞానం ఉన్నవాళ్లు కొందరు నాస్తికులవుతారు. ఈ విషయం నేను చాలాసార్లు గమనించాను," అన్నాడు.

సుబుద్ధి కృష్ణదాసుతో మామూలు విషయాలను గురించి మాట్లాడేవాడు తప్ప



వేదాంతం ప్రశంస తెచ్చేవాడుకాడు. కృష్ణ దాసుమటుకు తరుచు తన భగవద్భక్తిని గురించి మాట్లాడేవాడు.

"నాకూ నా కుమార్తెకూ సంగీతమంటే చాలా ఇష్టం. మీకు సంగీతంలో ఆసక్తి లేదని మీరే చెప్పారు. భగవద్భక్తికూడా అటు వంటిదే అనుకోండి. దానిలో ఆనందం తెలిసినాక అది లేనిదే జీవితం మోడైపోయి నట్టుంటుంది," అనేవాడు కృష్ణదాసు.

అయితే ఇటువంటి చర్చలవల్ల సుబుద్ధి కొంచెంకూడా మారలేదు.

ఒకనాడు కృష్ణదాసు సుబుద్ధితో, "ఈశ్వరుడి దయవల్ల నాకు మళ్లీ ఆరోగ్యం చేకూరింది. ఇక మేము మా గ్రామానికి వెళ్లిపోతాం, సెలవిప్పించండి!" అన్నాడు.

"మీరింకా ప్రయాణం చేసేస్థితిలో లేరు. కొంత బలం వచ్చాక వెళుదురుగాని!" అన్నాడు, సుబుద్ధి.

"కాదు, వెళ్ళాలి. మా గ్రామస్థులు నాకోసం ఎదురుచూస్తూ రోజులు లెక్క పెడుతూంటారు," అన్నాడు కృష్ణదాసు.

"మీరీస్థితిలో ఒంటరిగా ప్రయాణం చెయ్యటం నాకు ఎంతమాత్రమూ ఇష్టం లేదు. నేనుకూడా మీవెంట వస్తాను పదండి. దారిలో నేను మీకు సహాయపడటమే గాక, వంగదేశం చూసినట్టుకూడా అవుతుంది.





నేను ఎన్నో దేశాలు తిరిగాను గాని మీ ప్రాంతాలు చూడలేదు," అన్నాడు సుబుద్ధి.

దీనికి తండ్రి కూతుళ్ళు ఆనందంతో సమ్మతించారు. కొద్దిరోజులు ప్రయాణం చేసి ఆ ముగ్గురూ కృష్ణదాసుండే పల్లెటూరు చేరుకున్నారు.

కృష్ణదాసు తిరిగివచ్చిన సంగతి విని ఎంతోమంది గ్రామస్తులు అయనను చూడ వచ్చారు. ఆ గ్రామస్తులకు అయనమీద గల ఆదారాభిమానాలు చూసి సుబుద్ధి ఆశ్చర్యపడ్డాడు.

నలుగురూ చేరి కృష్ణదాసును భార్య పోయినందుకు పరామర్శించారు. "నాయనలారా! అంతా ఆ ఈశ్వరుడి నిర్ణయం!" అని కృష్ణదాసు సమాధానం చెప్పాడు.

ఇంతలో సాయంకాలమయింది. భజనలకు వేళ అయిందన్నారు.

"మీకు అభ్యతరం లేకపోతే మీరుకూడా ఉండవచ్చు. అభ్యంతరమైతే చల్లగాలికి తిరిగిరండి! మా సుగుణ గొంతెత్తి పాడితే మీరు వినలేదు. కావలిస్తే వినవచ్చు," అన్నాడు కృష్ణదాసు సుబుద్ధితో.

"అలాగే వింటాను. మీరు మీ భజన సాగించండి," అన్నాడు సుబుద్ధి.

గ్రామస్థులంతా కలిసి భజన ప్రారంభించారు. సుగుణకూడా పాడింది. అన్ని గొంతులమధ్యా ఆమెగొంతు తంబురా మీటినట్టు స్పష్టంగా, శ్రావ్యంగా వినిపించింది. ఎన్నడూ సంగీతంలో మాధుర్యం ఎరగని సుబుద్ధి చెవులకు ఆమెపాట ఎంతో ఆనందాన్ని కలిగించింది. కొద్దిరోజులుండి సుబుద్ధి కాశీనగరానికి ప్రయాణమైనాడు.

"మీరు వీలు చిక్కినప్పుడల్లా మా గ్రామానికి వచ్చి పోతూండాలి. మిమ్మల్ని రోజూ తలుచుకుంటూ ఉంటాం!" అని కృష్ణదాసూ, సుగుణా సుబుద్ధితో అన్నారు.

సుబుద్ధి కాశీనగరానికి తిరిగి వచ్చాడు. కొన్ని సంవత్సరాలు గడిచాయి. ఈ కాలంలో

అయనకు ఎన్నోసార్లు వంగదేశం వెళ్లి కృష్ణ దాసునూ, సుగుణనూ చూడాలనిపించింది. కాని ఆ కోరికను అయన అవివేకంగా భావించి అణచివేసుకున్నాడు.

ఇంతలో సుబుద్ధికి ఒక శుభలేఖ చేరింది. సుగుణకు పెళ్లి కాబోతున్నది. ఆమెను పెళ్ళాడబోయే యువకుడు తమకు దగ్గిర బంధువేననీ, అతను ఫలాని రాజుగారివద్ద కొలువున్నాడనీ, వారిద్దరికీ పెళ్లి జరగాలని ఎన్నో ఏళ్ళక్రితమే నిశ్చయమయిందనీ, సుగుణకు అతనంటే పంచప్రాణాలూననీ కృష్ణ దాసు సుబుద్ధికి రాశాడు.

ఈ శుభలేఖ చూడగానే సుబుద్ధి ప్రయాణమయాడు. మళ్ళీ సుగుణను చూస్తాననుకోగానే అయనకు ఎన్నడూ అనుభవం లేని అనందం ఒకటి పైకి తన్నుకువచ్చింది.

సుబుద్ధి కృష్ణదాసుండే గ్రామం చేరుకునే లోపునే చీకటిపడింది. అయితే అదృష్ట వశాత్తూ దారిలో ఒక మనిషి ఆ దారిగా వెళుతూ సుబుద్ధిని గ్రామం చేరుస్తానన్నాడు.

ఇద్దరూ కలిసి గ్రామం పొలిమేరవద్దకు వచ్చేసరికి శ్మశానంలో ఒక శవం దహనం అవుతూ కనబడింది.

"ఎవరో పోయినట్టున్నారే?" అన్నాడు సుబుద్ధి తన వెంట వున్న మనిషితో.



"కృష్ణదాసుగారి అమ్మాయి సుగుణ అనే పిల్ల పోయింది, బాబూ. పాపం, పెళ్ళి అనుకుంటున్నారు. ఇంతలో అకస్మాత్తుగా పెళ్ళికొడుకు చనిపోయినట్టు వార్తవచ్చింది. ఆ వార్త వింటూనే ఆ పిల్ల గుండె పగిలి చచ్చింది!" అన్నాడు దారిచూపిన మనిషి.

సుబుద్ధికి తల తిరిగిపోయినట్టయింది. అయన గుండె చల్లబడింది. కాళ్లు తేలిపోతూ అయన కృష్ణదాసు ఇల్లు చేరుకున్నాడు.

కృష్ణదాసు మధ్య కూచునివున్నాడు, చుట్టూ గ్రామస్తులున్నారు. అందులో చాలా మంది బావురుమని ఏడుస్తున్నారు. కృష్ణ దాసు వారిని ఊరడిస్తూ, "అంతా ఈశ్వరుడి

నిర్ణయం! మన చేతిలో ఏముంది? ఏడవ రాదు. ఆయన నిర్ణయానికి తల వంచ వలిసిందే!" అంటున్నాడు.

ఇంతలోనే ఆయన దృష్టి ఎడంగా నిల బడివున్న సుబుద్ధిమీద పడింది.

"వచ్చారా, బాబూ? సుగుణ వెళ్ళి పోయింది! భగవంతుడు తనవద్దకు పిలుచు కున్నాడు!" అన్నాడు.

సుబుద్ధికి దుఃఖం ఆగలేదు. ఆయన బావురుమని పెద్దపెట్టున సుగుణకోసం ఏడవ సాగాడు. సుగుణను మళ్లీ చూడాలని ఆయన హృదయం ఎంతగా ఎదురు చూస్తున్నదో అర్థమయాక సుబుద్ధి దుఃఖం కట్టలు తెంచుకుని ప్రవహించింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక్క సందేహం: అంత వేదాంతజ్ఞానం ఉండి, వికారాలన్నవి ఎరగని సుబుద్ధి ఎందుకు ఏడిచాడు? భార్యఅనీ, కూతురనీ క్షణ క్షణమూ కొట్టుకుపోయే కృష్ణదాసు ఎందుకు ఏడవలేదు? సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

"వేదాంతాన్ని నిత్య జీవితంలో ఆచరణలో పెట్టాలంటే సహజ స్వభావా లన్నిటినీ చంపుకోవాలి. కాని అవి పూర్తిగా చావవు; ఏదో అవకాశం చూసుకుని పైకి వచ్చేస్తాయి. భక్తి అలాటిది కాదు. భక్తిని ఆశ్రయించినవాడు స్వభావసిద్ధమైన సుఖా లన్నిటినీ అనుభవించి, భగవంతుడి ప్రసాద మనుకోగలడు; కష్టాలు వచ్చినప్పుడుకూడా భగవంతుడిచ్చినవేనన్న విశ్వాసంతో తట్టుకో గలడు. వేదాంతికి సుఖం అనుభవించే శక్తిగాని, కష్టాలకు తట్టుకునే శక్తిగాని ఉండదు. అందుకే వేదాంతి అయిన సుబుద్ధి ఏడిచాడు, భక్తుడైన కృష్ణదాసు ఏడవలేదు," అన్నాడు విక్రమార్కుడు.

రాజుకీ విధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# అలీబాబా

(గత సంచిక తరువాయి)

ఈలోపుగా దొంగలు అడవిలో ఉన్న తమ గుహకు తిరిగివచ్చి, కాసిం శవం మాయం కావటం చూసి పొందిన ఆశ్చర్యం ఇంతా అంతా కాదు. తమ బంగారంసంచులు మరికొన్ని పోవటంకూడా వారు వెంటనే తెలుసుకున్నారు.

"మన రహస్యం ఎవరో కనిపెట్టారు. మనం చంపినవాడికి ఎవరో తోడు వుండి వుండాలి. వాడే శవాన్నీ, బంగారాన్నీ తీసుకు పోయాడు. అందులో ఏమీ సందేహం లేదు. ఆ మనిషి ఎవడో తెలుసుకోకపోతే మనకు ప్రమాదం తప్పదు. అందుచేత మీలోకల్లా తెలివిగలవా డొకడు యాత్రికుడిలాగా వేషం వేసుకుని నగరంలోకి వెళ్ళాలి; మనం చంపిన మనిషిని గురించి ప్రజలు ఏం మాట్లాడుకుంటున్నారో ఆలకించి, మొదలు ఆ మనిషి జాడ తీయాలి; ఆ మనిషి పేరే మిటో, వాడెక్కడ వుండేవాడో తెలుసుకో వాలి. ఇది చాలా ప్రాణగండమైన విషయం. ఆరా తీయటానికి వెళ్లినవాడు ద్రోహం తల పెడితే మిగిలినవారందరికీ ప్రమాదం. అందుచేత ఈ పనిమీద వెళ్ళేవాడు ఏ కారణంచేత పని చేసుకురాకుండా తిరిగి వచ్చినా, వాడికి మరణశిక్ష విధించాలని నా ఉద్దేశం," అన్నాడు దొంగల నాయకుడు.

దొంగలు ఈ విషయం చర్చించకముందే ఒక దొంగ లేచి, "ఈ షరతుకు సమ్మ తించి ఈ పనికి నేను పూనుకుంటాను. ఒక వేళ నేను మిగిలిన వాళ్లకోసం చావవలిసి వచ్చినా నాకేమీ అభ్యంతరం లేదు," అన్నాడు ధైర్యంగా.

దొంగలనాయకుడూ, మిగిలిన దొంగలూ వాణ్ణి ఎంతో గొప్పగా మెచ్చుకున్నారు. తరవాత వాడు తనను ఎవరూ గుర్తించ రాకుండా వేషం మార్చుకుని, ఆ రాత్రే

ఆర్. సూర్యనారాయణ



బయలుదేరి, తూర్పు తెల్లవారే వేళకు నగరం ప్రవేశించాడు. వాడు వీధులన్నీ కలయ దిరుగుతూండగా బాబా ముస్తఫా దుకాణం కనిపించింది. మిగిలిన దుకాణాలేవీ తెరవక ముందే తన దుకాణం తెరవటం బాబా ముస్తఫాకు అలవాటు.

బాబాముస్తఫా అప్పుడే పని ప్రారంభించ బోతున్నాడు. దొంగ దుకాణంలోకి వెళ్ళి, బాబాముస్తఫాకు సలాంపెట్టి, "ఏం, తాతా? నీకు పగలే కళ్ళు సరిగా కనబడవేమోగదా, ఇంకా తెల్లవారకముందే పని ప్రారంభించా వేమిటి? ఈ వెలుతురులో నీకు చూపు అనుతుందా?" అని అడిగాడు.

"నాసంగతి నువ్వెరగవు. ముసలివా ణ్ణయినా నా చూపు కొంచెంకూడా చెడలేదు. ఎందుకూ? ఇంత వెలుతురుకూడా లేని చోట నేను శవాన్ని కుట్టాను!" అన్నాడు బాబాముస్తఫా.

"శవాన్నా?" అన్నాడు దొంగ, ఆశ్చర్య పోతున్నట్టు నటిస్తూ.

"అవునవును, నేనా కథంతా నీకు చెప్పేస్తా ననుకుంటున్నావు గామాలు. అదేం కుదరదు!" అన్నాడు బాబాముస్తఫా.

తనకు కావలిసిన రహస్యం ఈ ముస లాడు చెప్పగలడని దొంగకు నమ్మకం కుది రింది. వాడు ఒక బంగారు దీనారం తీసి బాబాముస్తఫా చేతిలో పెడుతూ, "నీ రహస్యాలు నాకెందుకు, తాతా? నీకు పిచ్చి గాని నాకు ఏ రహస్యం చెప్పినా నీకు కలిగే నష్టమేముందీ? నే నడిగేదల్లా ఏమిటంటే, నువ్వు ఈ శవాన్ని ఏ ఇంట్లో కుట్టావో ఆ యిల్లు నాకు చూపించు, చాలు!" అన్నాడు.

"ఒకవేళ నేను నీకా ఇల్లు చూపింతా మనుకున్నా అది నావల్ల అయే పనికాదే. నన్ను ఒకచోటికి తీసుకుపోయి, అక్కడ నా కళ్ళకు గంతలు కట్టి తీసుకుపోయారు. మళ్ళా గంతలు కట్టి నన్నిక్కడికే తెచ్చి విడిచిపెట్టారు. అందుచేత నీకా యిల్లు

చూపించటం నావల్ల అయే పనికాదు," అన్నాడు ముసలాడు.

"ఒకవేళ అదే చోటికి తీసుకుపోయి కళ్ళకు గంతలు కట్టితే, నన్నాయింటికి తీసుకుపోగలవేమో చూడు. నీ రుణం ఉంచుకోనులే. ఇంద, ఇంకొక దీనారం తీసుకో!" అంటూ దొంగ బాబాముస్తఫా చేతిలో మరొక బంగారు నాణెం పెట్టాడు.

ముసలాడు తన చేతిలో ఉన్న రెండు దీనారాలకేసి చాలాసేపు చూశాడు. అవి ఆ ముసలాణ్ణి చాలా ఆకర్షించాయి. వాటిని జేబులో వేసుకుంటూ, "ప్రయత్నిస్తాను; కాని ఆ దారి నాకు జ్ఞాపకం ఉంటుందని మాట ఇవ్వలేను," అన్నాడు.

బాబా ముస్తఫా దొంగను వెంటబెట్టుకుని ఒక చోటికి వచ్చి, "ఇక్కడే నా కళ్లకు గంతలు కట్టారు. తరవాత నన్ను ఇటుగా తీసుకుపోయారు," అన్నాడు.

దొంగ ముసలాడి కళ్లకు తన చేతి రుమాలు గంత కట్టాడు. తన జ్ఞాపకాన్ని అనుసరించి బాబా ముస్తఫా తనవెంట ఉన్న దొంగను సరిగా కాసిం ఇంటికి చేర్చాడు. దొంగ ఇంటి వాకిలి తలుపుపైన సుద్దముక్కతో ఒక గుర్తు పెట్టి, బాబా ముస్తఫా కళ్లకు కట్టిన గంత విప్పాడు.




ఆ ఇల్లెవరిదో తెలుసునా అని దొంగ అడగగా ముసలాడు తానా పేటలో ఉండేవాణ్ణి కాననీ, తనకు తెలియదనీ చెప్పాడు. ముసలాడి నుంచి ఇంక తెలుసుకోవలిసినది లేదని గ్రహించి దొంగ ముసలాడివద్ద సెలవు తీసుకుని నేరుగా అడవిలోని తన అనుచరుల వద్దకు వెళ్లిపోయాడు.

దొంగా, బాబా ముస్తఫా వెళ్లిపోయిన కొద్దిసేపటికి మోర్జియానా ఏదో పనిమీద బయటికి వెళ్ళి, తిరిగివస్తూ వాకిలిమీద ఉన్న గుర్తు చూచింది.

"ఈ గుర్తు ఏమిటై ఉంటుంది. నా యజమానికి ఎవరో అపకారం తలపెట్టి

నట్టుందే! ఎటుపోయి ఎటువచ్చినా కీడెంచి మేలెంచటం మంచిది!" అనుకుని మోర్జియానా లోపలికి వెళ్లి ఒక సుద్దముక్క తెచ్చి తమ ఇంటికి అటూ ఇటూ ఉన్న వాకిళ్ళకుకూడా అలాటి గుర్తులే పెట్టింది. ఈ విషయం ఆమె అలీబాబాకు చెప్పలేదు.

ఈ లోపుగా దొంగ తనవారిని చేరుకుని తాను సాధించిన విజయాన్ని గురించి చెప్పాడు. అందరూ వాణ్ణి అభినందించారు. తరవాత దొంగల నాయకుడు తన అనుచరులతో ఇలా అన్నాడు: "సోదరులారా, మనం జాగు చేయరాదు. ఆయుధాలు తీసుకుని, మారువేషాలు వేసుకుని నగరంలోకి వెళ్ళాలి. అందరమూ కలిసి వెళితే అంతా అనుమానిస్తారు. అందుచేత ఇద్దరిద్దరుగా వెళ్ళి, అందరమూ నగరంలోని పెద్ద చౌకులో కలుద్దాం. ఈ లోపుగా నేనూ, ఇల్లు చూసి వచ్చిన మన సోదరుడూ కలిసి గుర్తుపెట్టిన ఇంటికి వెళ్లి పరిస్థితి చూసివస్తాము. ఆ తరవాత అందరమూ కలిసి కర్తవ్యం నిర్ణయించవచ్చు."

దీనికి అందరూ సమ్మతించారు. దొంగలు ఇద్దరిద్దరుగా చీలి, ఒక జత వెళ్ళిన తరవాత మరొక జత చొప్పున, ఎవరికీ ఏ అనుమానమూ కలగకుండా, నగరాన్ని చేరుకున్నారు. దొంగల నాయకుడూ, ఇల్లు గుర్తు



పెట్టిన దొంగా అఖరుకు బయలుదేరి అలీ బాబా ఉంటున్న వీధికి వచ్చారు. మోర్జి యానా గుర్తుపెట్టిన ఇళ్ళలో ఒక చివర వున్న ఇంటిని చూడగానే దొంగ, "ఇదే నేను గుర్తుపెట్టిన ఇల్లు!" అన్నాడు.

"దీనిపక్క ఇల్లుకూడా ఇలాగే గుర్తు పెట్టి ఉన్నదే!" అన్నాడు దొంగల నాయ కుడు. ఆ రెండు ఇళ్ళలోనూ అసలు ఇల్లేదో తెలియక వారు తికమక పడుతూండగా వారికి ఇంకా చాలా ఇళ్ళు అదేవిధంగా గుర్తుపెట్టి ఉండటం తెలియవచ్చింది. ఇల్లు గుర్తుపెట్టిన దొంగ కంగారుపడిపోయాడు. తాను ఒక్క ఇంటికే గుర్తుపెట్టానని ప్రమాణంచేసి చెప్పాడు. మిగిలిన గుర్తు లింకెవరో పెట్టిఉండాలన్నాడు.

దొంగల ప్రయత్నం విఫలమయింది. పెద్దచౌకులో మిగిలినవాళ్లను కలుసుకుని, ప్రస్తుతానికి చేసేదేమీ లేదని చెప్పి దొంగల నాయకుడు వారితోసహా అడవిలోకి వెళ్ళి పోయాడు. మిగిలినవారంతా ఎలా వచ్చారో అలాగే తిరిగి వెళ్ళారు. ఇల్లు కనుక్కోవ టానికి వెళ్ళి విఫలుడైన దొంగ మరణదండ నను అహ్వానించాడు. అతనిని శిరచ్ఛేదం చేశారు. వెంటనే ఆ పని పూర్తిచేయటానికి మరొక సాహసి ముందుకు వచ్చాడు. తరవాత వాడు నగరంలోకి వెళ్ళి బాబా ముస్తఫాకు





పెట్టుకుని దొంగల నాయకుడు అలీబాబా ఉంటున్న వీధికి వెళ్ళాడు. చాలా ఇళ్ళకు ఎర్రగుర్తులుండటం చూసేసరికి వారి ఆశ నిరాశ అయిపోయింది. చేసేదిలేక అందరూ మళ్ళీ అడవికి తిరిగి వెళ్ళారు. ప్రయత్నం విఫలం కావటంవల్ల రెండవ దొంగకుకూడా శిరచ్ఛేదం జరిగింది.

మెరికలవంటి అనుచరులు ఇద్దరు పోయే సరికి, ఇక ఈ పద్ధతివల్ల ప్రయోజనం లేదని దొంగల నాయకుడు గుర్తించాడు. ఈసారి తానే స్వయంగా బయలుదేరి బాబా ముస్తఫా వద్దకు వెళ్ళాడు. అదివరకులాగే బాబా ముస్తఫా సహాయపడ్డాడు. ఆ ముసలివాడి సహాయంతో దొంగల నాయకుడు అలీబాబా ఉంటున్న ఇంటిముందు నిలబడ్డాడు. కాని అతను ఆ ఇంటికి ఎలాటి గుర్తులూ పెట్టక, ఆ వీధివెంబడి అటూ ఇటూ చాలాసార్లు నడిచి ఇల్లు పూర్తిగా పరిచయం చేసుకుని అడవికి తిరిగి వెళ్లిపోయాడు.

"సోదరులారా, ఈసారి నేను ఆ ఇంటిని బాగా మననం చేసుకు వచ్చాను. ఇక ఎటువంటి పొరబాటూ జరగదు. మనం పగ తీర్చుకోవచ్చు. అందుకుగాను నేనొక ఆలోచన చేశాను, వినండి. మీలో ఎవరికైనా అంతకంటె మంచి ఆలోచన తట్టితే

బాగా లంచంపెట్టి అలీబాబా ఉంటున్న ఇల్లుగుర్తు తెలుసుకున్నాడు. అయితే వాడా ఇంటిమీద అందరికీ సులువుగా కనబడని చోట ఒక ఎర్రగుర్తు పెట్టి తనవారివద్దకు తిరిగి వెళ్ళాడు.

అయితే మోర్జియానా కళ్ళు చాలా చురుకైనవి. ఆమె ఈ ఎర్రగుర్తునుకూడా పసికట్టి, ఎందుకైనా మంచిదని అలాటి గుర్తులు మిగిలిన ఇళ్లకుకూడా పెట్టేసింది.

దొంగలు ఈసారి తమ ఎత్తు పారుతుందని ఆశపడ్డారు. వెనకటిలాగే ఎవరికీ ఎటువంటి అనుమానమూ కలగకుండా నగరం ప్రవేశించారు. ఎర్రగుర్తు పెట్టిన దొంగను వెంట

చెప్పండి, వింటాను!" అంటూ దొంగల నాయకుడు తాను చేసిన ఆలోచనను తన అనుచరులతో చెప్పేశాడు. వారు ఆ ఆలోచనను పూర్తిగా బలపరచటమేగాక అతణ్ణి ఎంతగానో అభినందించారు.

తరవాత దొంగలు చుట్టుపక్కల గల గ్రామాలకు వెళ్లి పందొమ్మిది కంచరగాడిదలనూ, ముప్ఫైఎనిమిది పెద్ద తోలుతిత్తులనూ కొన్నారు. ఆ తిత్తులలో ఒకదాని నిండా నూనె నింపారు. మిగిలిన ముప్ఫైఏడు తిత్తులలోనూ ముప్ఫైఏడుగురు దొంగలు ఆయుధాలతో సహా దూరి కూచున్నారు. దొంగల నాయకుడు ఆ తిత్తుల పైభాగాన నూనె పూశాడు.

తరవాత దొంగల నాయకుడు నూనె వ్యాపారి వేషం ధరించి, ముప్ఫై ఎనిమిది తిత్తులనూ పందొమ్మిది కంచరగాడిదల పైనా వేసి, వాటిని తోలుకుంటూ బయలుదేరి చీకటిపడే వేళకు నగరం చేరుకున్నాడు. అతను ఆ కంచరగాడిదలను తోలుకుంటూ అలీబాబా ఉండే వీధి చేరేసరికి చాలా పొద్దు పోయింది. అలీబాబా అప్పుడే భోజనం ముగించి వాకిలివద్ద చల్లగాలికి నిలబడ్డాడు.

దొంగల నాయకుడు అలీబాబాను సమీపించి, "అయ్యా, నేను నూనెవర్తకుణ్ణి.



చాలా దూరంనుంచి వస్తున్నాను. రేపు సంతలో ఈ నూనె అమ్మేస్తాను. చాలా పొద్దు పోయింది. ఈ రాత్రికి ఎక్కడ బస చేయాలో తెలియదు. మీకేమీ శ్రమ లేని పక్షంలో నన్ను ఈపూట మీ ఇంట తల దాచుకోనివ్వండి. మీమేలు ఎన్నటికీ మరవను," అన్నాడు.

అలీబాబా ఈ దొంగల నాయకుణ్ణి అదివరకు అడవిలో చూసిఉన్నాడు, అతని గొంతు విని ఉన్నాడుకూడా; అయినా ఆయన ఆ మనిషిని గుర్తుపట్టలేకపోయాడు.

"దానికేం భాగ్యం? దయచెయ్యండి!" అంటూ అలీబాబా వాకిలి తెరిచి దొంగల

నాయకుణ్ణీ, అతని కంచరగాడిదలనూ లోపలికి రానిచ్చాడు.

అబ్దుల్లా అనే బానిసవాడు వచ్చి కంచర గాడిదలమీద ఉన్న తిత్తులను దింపి, కంచరగాడిదలను పశువుల కొట్టంలోకి తీసుకుపోయి వాటికి దాణా వేశాడు. మోర్జి యానా అతిథికోసం మళ్ళీ వంట చేసింది. దొంగల నాయకుడు భోజనం చేసినాక అలీ బాబా మోర్జియానాతో, "మన అతిథికి ఏ లోపం రాకుండా జాగ్రత్తగా చూసుకో! నేను రేపు తెల్లవారకముందే బయలుదేరి స్నానశాలకు వెళతాను. నా దుస్తులూ అవీ తీసి అబ్దుల్లా చేతికి ఇయ్యి, నేను స్నానం చేసి తిరిగి వచ్చేసరికి నా భోజనానికి శోర్బా తయారుచేసి సిద్ధంగా ఉంచు," అని హెచ్చ రించి వెళ్ళి పడుకున్నాడు.

ఈలోపుగా దొంగల నాయకుడు దొడ్డిలోకి వెళ్లి ఒక్కొక్క తోలుతిత్తిమీద ఉన్న మూతా ఎత్తి, "నేను కిటికీలోనుంచి గులక రాళ్లు విసరగానే బయటికి రావాలి. మరప వద్దు!" అని తిత్తిలో ఉండే దొంగలకు పేరుపేరునా చెప్పాడు.

అతను ఇంట్లోకి తిరిగిరాగానే మోర్జి యానా అతను పడుకునే చోటు చూపి, తన యజమాని దుస్తులు తీసిపెట్టి, శోర్బా తయారు చెయ్యటానికిగాను పొయి రాజెయ్య మని అబ్దుల్లాతో చెప్పింది. పొయి రాజగానే ఆమె శోర్బా తయారుచేయ నారంభించింది. కాని మధ్యలో చమురు అయిపోయి దీపం కాస్తా ఆరిపోయింది.

"వంట పూర్తికాలేదు. మధ్యలో దీపం ఆరిపోయింది. ఇంటో ఒక్క చుక్కకూడా నూనె ఉన్నట్టు లేదు. ఏంచెయ్యాలో నాకు తోచకుండా ఉన్నది," అన్నది మోర్జియానా.

"ఆ వర్తకుడి తిత్తులనిండా నూనె ఉన్నది. కొంచెం పట్టుకురా. ఇంతలో కొంప మునిగిపోదులే!" అన్నాడు అబ్దుల్లా.

—(ఇంకా వుంది)





# ఫలించని వరం

ఒక గ్రామంలో ఇద్దరు స్త్రీలుండేవారు. వారిలో ఒకతె చాలా డబ్బుగలది, కాని పిసినిగొట్టు, చాలా కఠినహృదయురాలుకూడా.

రెండోఆవిడ చాలా పేదది, కాని చాలా మంచిది; ఆవిడ హృదయం వెన్నలాటిది.

ఈ ఇద్దరు స్త్రీలూ పక్కపక్క ఇళ్లలోనే ఉండే వారు.

ఒకనాటి సాయంకాలం ఒక బిచ్చగాడు అటుగా వెళుతూ ధనికురాలి ఇంటితలుపు తట్టాడు. ఆవిడ తలుపు తీసి, బిచ్చగాణ్ణి చూసి దబాల్న మళ్ళీ తలుపు మూసింది. "ఇంకోచోటు చూసుకో, నాయనా!" అని అయినా ఆవిడ నోట రాలేదు.

బిచ్చగాడు మరి రెండడుగులు వేసి పేదరాలి తలుపు తట్టాడు. ఆవిడ తలుపు తీసి బిచ్చగాణ్ణి చూసింది. తనకే కడుపునిండా తిండి లేకపోయినప్పటికీ, ఆవిడ లోపలికి వెళ్ళి ఇంత రొట్టె తెచ్చి బిచ్చగాడికిచ్చి, "ఇది తిని కాస్త మజ్జిగ తాగు. పొద్దూకుతున్నది. కావలిస్తే ఈ రాత్రికి మా పంచలో పడుకోవచ్చు," అన్నది.

బిచ్చగాడు రొట్టె తిని, మజ్జిగ తాగి, "నేను వెళ్ళాలి, తల్లీ. నీకేలోటూ లేకుండా జరిగిపోతున్నదా, అమ్మా ?" అని అడిగాడు.

"నాకు ఎక్కువగా కావలిసిందేమిటి, నాయనా ? బాగానే జరుగుతున్నది," అన్నది పేదరాలు.

"పెట్టేవారికి పుట్టకపోదులే, అమ్మా. పొద్దున ప్రారంభించిన పని పొద్దూకేదాకా ముగించవు, చూస్తూఉండు!" అంటూ బిచ్చగాడు తన దారిన వెళ్లిపోయాడు.

వాడు అలా ఎందుకన్నాడో ఆవిడకు అర్థం కాలేదు. ఆవిడ వాడి మాటలను అప్పుడే మరిచిపోయిందికూడా.

మర్నాడు ఆమె పక్కమీదినుంచి లేస్తూనే తనవద్ద ఎంత బట్ట మిగిలిఉన్నదీ

ఎమ్. అమరేశ్వరరావు





కొలిచి చూద్దామనుకున్నది. ఆ బట్ట ఆవిడ వడికిన నూలుతో నేయించి ఉంచినదే. దాన్ని అమ్ముకుని ఆవిడ అవసరానికి ఖర్చు చేసుకుంటూ ఉండేది.

ఆవిడ తన పెట్టెలోనుంచి బట్టచుట్ట తీసి మూరవేసి, "ఒకటీ, రెండూ," అని కొలవ నారంభించింది. ఎన్ని మూరలు కొలిచినా ఇంకా బట్ట వస్తూనే ఉంది. "పొద్దున ప్రారంభించిన పని పొద్దూకేదాకా ముగించవు, చూస్తూ ఉండు!" అని బిచ్చగాడన్న మాటకు అర్థమేమిటో ఆవిడకు అప్పుడు తెలిసి వచ్చింది. ఆ రోజు సూరాస్తమయం అయ్యే లోపల ఆవిడ అనేకవేల గజాల బట్టను మూరవేసింది. ఆ విధంగా ఆవిడ కొలిచిన బట్ట ఇంటినిండా ఇంతయెత్తున పోగు పడిఉంది.

పల్లెటూళ్లో ఏ విషయమూ దాగదు. మర్నాడు పొద్దుటికల్లా ఊళ్ళోవాళ్లు ఈగల మందలాగా వచ్చి పేదరాలి ఇంటిమీద పడి తలా రెండు గజాలూ, నాలుగు గజాలూ బట్ట కొనుక్కుపోయారు.

ఈ విధంగా ఊళ్ళో అందరికీ అమ్మినా కూడా పేదరాలికి జీవితాంతందాకా సరిపడే బట్ట మరికొంత మిగిలింది.

పేదరాలిని బిచ్చగాడు ఆశీర్వదించిన సంగతికూడా ఊరంతా పాకింది. ఈ వార్త వినగానే పొరుగింటావిడ అసూయతో కుళ్లిపోయింది. అటువంటి అవకాశం చేజేతులా పోగొట్టుకున్నందుకు ఆవిడకు మతిపోయినంత పని అయింది.

మూడురోజులు గడిచినాక ఒక సాయంకాలం మళ్ళీ ఎవరో ధనికురాలి వాకిలి తట్టినట్టు చప్పుడయింది.

ధనికురాలు హడావిడిగా వెళ్లి తలుపు తెరిచేసరికల్లా ఎదురుగా దేవుడల్లే ఆ బిచ్చగాడే కనిపించాడు.

"వచ్చావా, నాయనా? రా, లోపలికి రా! ఆ రోజు నీకు ఆతిథ్యం ఇవ్వలేకపోయాను.







ఒకటా, రెండా? అన్ని పనులూ నేనే చేసుకోవాలాయె! ఆ రోజు ఎంత చిరాకులో ఉన్నానో చెప్పలేను. గొడ్డు కాస్త పలుపు తెంచుకుని పాదులన్నీ పొట్టన పెట్టుకున్నది. అందుచేత నీ విషయమే చూడలేక పోయాను!" అంటూ ధనికురాలు బిచ్చగాడి మీద ఎంతో అపేక్షగా మాట్లాడసాగింది.

అదంతా అపేక్ష? కానేకాదు! పేదరాలికి ఇచ్చిన వరమే బిచ్చగాడు తనకూ ఇవ్వాలని ఆవిడ ఆశ!

ఆవిడ బిచ్చగాణ్ణి లోపలికి పిలిచి కూరలతోసహా విందుభోజనం పెట్టింది. పాయసం కూడా వడ్డించింది. వాడు భోజనం ముగించాక, "ఈ రాత్రికి ఎక్కడికి పోతావులే, నాయనా, యిక్కడే పడుకో. నవారు మంచమూ, మంచి ఖారుగుదూది పరుపూ వేస్తాను. కప్పుకోవాలంటే మంచి శాలువా కూడా యిస్తాను!" అన్నది.

అయితే బిచ్చగాడు వెళ్లాలన్నాడు. వెళ్లేటప్పుడు వాడు, "పొద్దున ప్రారంభించిన పని పొద్దుకేదాకా ముగించవులే, తల్లీ!" అని ఆశీర్వదించి తన దారిన తాను బయటికి వెళ్లిపోయాడు.

ధనికురాలి ఆనందానికి మేరలేదు. ఆ రాత్రి ఆవిడ కంటికి కునుకులేదు. తెల్లవారుతూనే లేచి ఏం చేస్తే ఎక్కువ లాభిస్తుందో ఆమె తెల్చుకోలేకపోయింది. వెన్న చిలికితే మణుగులకు మణుగులు వెన్న వస్తుంది. కాని రోజల్లా చిలికితే రెక్కలు రెండూ పడిపోతాయి! అందువల్ల ఆ పని చేయటం లాభంలేదు.

చిట్టచివరకామెకు ఒక దివ్యమైన ఆలోచన తట్టింది. తన చందుగాయ పెట్టెలో నాలుగు మొహరీలున్నాయి. వాటిని తీసి ఎంచటం ప్రారంభిస్తే సరి! సాయంకాలం దాకా ఎన్నో లక్షల, కోట్ల మొహరీలను ఎంచవచ్చు. ఆ తరవాత తనకన్న భాగ్యవంతులు ప్రపంచంలో ఉండరు.



49



ఈ ఆలోచనతో ఆవిడకు మనసు పరవశ మైపోయి అసలే నిద్ర పట్టలేదు. ఎప్పుడు తెల్లవారుతుందా అని తూర్పువేపు కిటికీకేసి చూస్తూ పడుకున్నది. చిట్టచివరకు కోళ్లు కూశాయి, తెల్లవారింది.

ధనికురాలు మంచంమీదినుంచి లేచి తన చందుగాయపెట్టెవద్దకు బయలుదేరింది. ఆమె ఒక అడుగు వేసిందో లేదో, ఎక్కడి నుంచో ఒక కందిరీగ వచ్చి మెడమీద వాలి కుట్టింది. ధనికురాలు దాన్ని కొట్టేలోపుగా అది లేచి పారిపోయింది. ఆవిడ కోపంతో దాన్ని తరమసాగింది. ఇంతలో ఇంకొక కందిరీగ వచ్చి ఆమెను కుట్టింది.

బిచ్చగాడి ఆశీర్వచనం అక్షరాలా నిజ మయింది. ఆ రోజల్లా ఆమెను కందిరీగలు కుడుతూనే ఉన్నాయి; ఆవిడ వాటిని వేటాడుతూనే ఉంది. కందిరీగలు లక్షల సంఖ్యలో, పుట్ట పగిలినట్టుగా వచ్చి ధనికు రాలి ఇంటినిండా ముసిరాయి. ధనికు రాలికి మతిపోయింది. ఆమె ఆ కందిరీగల నుంచి తప్పించుకోలేకపోయింది.

పొద్దుకేలోపల ఈ వార్త గ్రామమంతటా వ్యాపించింది. ధనికురాలు సంపాదించు కున్న వరం ఏ విధంగా పరిణమించినదీ చూడటానికి గ్రామంలో గల స్త్రీలూ, పురు షులూ, పిల్లలూ, వృద్ధులూ కదిలివచ్చారు.

ధనికురాలికి కిందటి రాత్రి గడవటం ఎంత కష్టమయిందో ఈ పగలు గడవటం కూడా అంత కష్టమయింది.

చిట్టచివరకు సూర్యాస్తమయమయింది. కందిరీగలు ఎలా వచ్చాయో అలాగే వెళ్ళి పోయాయి. గ్రామస్థులుకూడా అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

ఇక ఆ గ్రామంలో ఉండటానికి ముఖం చెల్లక ధనికురాలు బండి చేయించుకుని, ఆ రాత్రే తన సామానంతా తీసుకుని ఆ గ్రామం విడిచి మరొక చోటికి ప్రయాణమై వెళ్లిపోయింది.






కొత్తసన్యాసి :

మతి లేక వచ్చితి - మఠ మిది యంచు
గతిలేక కాదు నీ-కత యెల్ల దెలిసె.
ఏమిటో యోచింతు - వేది చెప్పినను
నామాట వినవు ; ఏ-దో మాట అనవు.
అతిథి వచ్చిన దిక్కు - లటు చూచువాని
అతిథి యోగక్షేమ - మడుగనివాని
కొంపకు పోవుట - కూడ దెన్నటికి
కంప చెట్టును జేరు - కరణి అదెప్డు.
ఎదురేగి తియ్యగా - నేమేమొ పలికి
అది యిది యడుగని-యట్టి గృహస్థు
కడకేగు టెప్పుడు - కడు చెట్ట సుమ్ము
పడి పోదు నింక ఈ-గుడి నుండబోను.

పాతసన్యాసి :

అయ్యయ్యో అపరాధ -మైనది స్వామి
కుయ్యో మొఱ్ఱో మిమ్ము-గూర్చియే కాదు.
కొన్ని రోజులనుండి, - కుడుచు కూడెల్ల
ఎన్ని యెల్కలు వచ్చి - ఎటొ తినుచుండె.
మిగులు సగులు బెట్టి - మిగిలిన పనులు
అగచాట్లుపడి చేయు-మనుచుంటి నెట్లొ
మిగిలిన దంతయు - మ్రింగు నీ యెల్క
అగు నెట్లు పను లెవ్వ రా-అనువారు ?

కొత్తసన్యాసి :

అంతేకదా దిగు - లంత ఎందులకు
సుంతైన ఆ కల్గు - చొప్పు చెప్పెదవ ?

పాతసన్యాసి :

నాకేమి తెలియు దా - నాటకమెల్ల
చీకటి పడినంత - చేరు నవెల్ల

కొత్తసన్యాసి :

ఏదొ ధనమ్మిట - నెంతేని యుండు
ఆ దానిపైన బి-లాంతరమ్ముండు.
అందుకే ఈ యెల్క - అంతగా బలిసె
అందుకే అంత పై-కైన లంఘించు.
కల దొక్క కథ దీని - కల యర్థమెల్ల
తిలకింపజేయు నా - తీరును వినవె.

విద్వాన్ విశ్వం



పాతసన్యాసి :
ఏమిటా కథ విని-పింపుడు స్వామి
మీ మాటలు వినంగ - మెఱసెను వేడ్క.

పాతసన్యాసి చెప్పిన కథ :
చెప్పెద వినుమింక - చెవులింత చేసి
ఎప్పటికైన నీ-వే గ్రహియింతు.
ఒక వానకాలమ్ము - నొకచోట గడపు
టకు నిశ్చయించి నే-నొక విప్రు జేర
అతండు సంతోష-మందుచు నిలిపె
ఏ తర్కములు లేక - యేనుంటి నచట.
కొలది రోజులు వాని-కొలది భుజించి
అల దేవతార్చన-మ్ముల మున్గియుంటి.
ఒకనాడు తెలవారు-చుండగా గేస్తు
చకచక పోవుచు - చానతో ననియె :
" కటక సంక్రాంతి రే-పట యగు గాన
నటు వెళ్ళిపత్తు దా-నాదులు గొనగ.
ఆ విప్రునకు భోజ-నాదుల నిడుము
దేవతార్పణముగా - దేవిరో " అనియె
ఆమాట కామె నే-రంతయు విచ్చి
" ఏ మాడ లేకనే - ఎటు వచ్చు కూడు
నను కట్టుకొంటివి - నాకేమి సుఖము
లను కూర్చినావు వి-లాసమ్ము లేవి ?"
అన విప్రు-" డది కాదు - అభ్యాగతులకు
తిననున్న దానిలో - తినబెట్టవలయు
ఎంత లేకున్న ఉ-న్నంతలో నొకరి
కింత బెట్టుట పుణ్య - మిది వినలేదె
అత్యాశ కూడదే - అతివ ఏనాడు
సత్యమ్ము-ఒక కథ - సొంతమ్ము వినుము :
అడవిలో నొకబోయ - నడచెను వేట
చెడు పందిపై ఈడ్చి - విడిచె బాణమ్ము
దెబ్బతో శివమెక్క - దెయ్యమ్మువోలె
బొబ్బరించుచు నెగ్గు - బోయను జంపె
శరబాధతో నది - చచ్చియే పడియె
సరి అట కొక నక్క - చరచర వచ్చె.
శ్రమలేక ఇటు రెండు - శవములు దొరికె
క్రమముగా కొన్నాళ్ళు - గడచు కాలమ్ము
ఇప్పటికీ వింటి - కెక్కించు నారి
చప్పున తిని రేపు - శవముల దిందు-
అనుకొని ఆ నక్క - అటు నారి గొఱుక

ధనువెల్ల చక్కనై - ధణ అని తగుల
నక్క ఆ వ్రేటుతో - గ్రక్కున జచ్చె
ఒక్క క్షణమ్ములో - నోకాంత, గాన
అడియాస కూడదు - పడిపడి వత్తు
అడకువ వానికి - అన్నమ్ము పెట్టు"
అని బ్రాహ్మణుడు భార్య కట్లు - వచించి
తన దారి బడి చనె - దానాల కొఱకు.
అంత నా బ్రాహ్మణి - చెంత నున్నట్టి
ఇంతింత నువ్వుల - నెల్లను తడిపి
పొట్టూడదీసి ఆ - ప్రొద్దుట నాకు
పొట్ట నింపుటకయి - పొలతి యోచించి
ఆ నువ్వు లెండలో - నటులుంచి యుండ
గానె కుక్కొక్కటి - కని మూతి వెట్టె.
అయ్యో నేసంతగా - అమరించినట్టి
వియ్యావి మైలయై - ఏటిలో గలిసె.
అనుకొని "పొట్టు దీ-సిన నువ్వు లిత్తు
కొనుడు, పొట్టున్న నూ-లను నాకు నిండు"
అని యామె యడుగ నిం-దున నేదొ కలదు
కన నెవ్వరైన చే-సిన నువ్వులిచ్చి
ముడినువ్వులను కొన - ముగబడువారె?
ముడి యేదొకలదని - మూచ్చూప రెవరు?

* * *

పాతసన్యాసి :

అటుగాన త్రామ చూ-డా, ఎలు కిట్లు
పటు బలమ్మును జూపు-నటులన్న నేదొ
నిధి యుండు నిక్కడ - నిధిపైన బిలము



నిది చేరి పొగరున - నిట్లుండవలయు
విత్తమ్ము త్రొవ్వియే - వేసితిమేని
చెత్తయైపోవు నీ-చెడు నెల్క వినుము

హిరణ్యకం :

అని చెప్పి తా త్రామచూ-డునితోడ గూడి
గునపమ్ముతో కల్లు - గుంత తోడంగ
ఎటు పోవలేక నే - నింకెట్లు లనుచు
తటుకున బొరియలో - తప్పుకోనుండ
నావెన్కనే వచ్చె - నా యెల్కలన్ని
దేవరతోడనే - సేవకుల్ గాదె.
ఇంతలో మార్జాల - మెగయుచు వచ్చె
కంతలో మేమెల్ల - కళవళపడగ
నేనెట్లొ దుమికి దా-నిని తప్పుకొంటి
వానినెల్లను జంపె - బావురు బిల్లి.



53




# అద్భుతదీపం

## 5

[అలాదీన్ రాజకుమార్తె బుదూర్‌ను చూసి ప్రేమించాడు. అతని తల్లి అతనితరపున రాజుగారి దర్శనం చేసుకుని, అలాదీన్ గుహలోనుంచి తెచ్చిన అమూల్యమైన రత్నాలు కానుకపెట్టి, రాజకుమార్తెను తన కొడుకుకిచ్చి చేయమని విజ్ఞాపన చేసుకున్నది. రత్నాలు చూసి దిగ్భ్రమ చెందిన రాజు పెళ్ళికి ఒప్పుకున్నాడు. మంత్రి అడ్డపడి పెళ్ళిని మూడు నెలలు వాయిదా వేయించాడు. రెండునెలలు గడిచాయి. ఒకనాడు అలాదీన్ తల్లి నూనెకోసం దుకాణానికి వెళ్ళి నగరమంతటా అలంకరణలూ, ఉత్సవాలూ చూసి, ఆ రోజే రాజకుమార్తెకూ మంత్రికుమారుడికీ పెళ్ళి జరగనున్నట్టు తెలుసుకున్నది.]

ఆమె ఇంటికి తిరిగి వస్తూనే అలాదీన్‌తో, "నాయనా, అశుభవార్త తెచ్చానురా! అది వింటే నువ్వెంత బాధ పడతావో!" అన్నది.

"ఏమిటమ్మా ఆ వార్త?" అన్నాడు అలాదీన్ ఆత్రంగా.

"ఏం చెప్పేది, నాయనా? రాజుగారు నీకిచ్చిన మాట తప్పి, తన కూతురిని మంత్రి కొడుకుకిచ్చి చేస్తున్నాడు. ఈ రాత్రే లగ్నం. రాజుగారు సరే నన్నప్పటికీ మంత్రి ఏదో కుతంత్రం చేస్తాడని నేను భయపడుతూనే వచ్చాను సుమా!" అన్నది తల్లి.

"ఇంతకూ ఈ పెళ్లి సంగతి నీకెలా తెలిసిందమ్మా?" అని అలాదీన్ తల్లిని అడిగాడు.

బి. ప్రసాదరావు



ఆమె నగరంలో తాను చూసినవీ, తెలుసుకొన్నవీ అతనికి చెప్పేసింది. అలాదీన్ ఒక్క క్షణం పాటు నివ్వెర పోయాడు, కాని మరు క్షణం అతనికి తనవద్ద ఉన్న అద్భుత దీపం జ్ఞాపకం వచ్చింది.

"ఎందుకు విచారిస్తావమ్మా ? ఈ రాత్రికి ఈ పెళ్లి జరిగే మాట అబద్ధం. నువు లేచి వంట చెయ్యి. భోజనం చేశాక నేనా పెళ్లి భగ్నం చేసే పని చూసుకుంటాను," అన్నాడు అలాదీన్ తల్లితో.

భోజనం చేసి అతడు తన గదిలోకి వెళ్లి, దీపం పైకి తీసి దాన్ని రుద్దాడు. వెంటనే భూతం ప్రత్యక్షమై, "ఏం సెలవు?" అన్నది.

"విను. రాజుగారు తన కూతుర్ని నాకిచ్చి పెళ్లి చేస్తానని మాట ఇచ్చాడు. అందుకు మూడు నెలలు గడువు కోరాడు. ఇంకా ఆ గడువు తీరకమునుపే తన కూతురిని మంత్రికొడుకు కిచ్చి ఈ రాత్రే పెళ్లి చేస్తున్నాడు. అందుచేత నీవు ఈ రాత్రి పెళ్లి కూతుర్నీ పెళ్లికొడుకునూ వాళ్ల గది నుంచి ఎత్తుకునివచ్చి నా ఎదట పెట్టు," అని అలాదీన్ దీపంభూతాన్ని ఆజ్ఞాపించాడు.

కొద్ది సేపటిలోనే భూతం పెళ్లికొడుకునూ, పెళ్లికూతుర్నీ తెచ్చి అలాదీన్ ముందు పెట్టి, "ఇంకేం సెలవు ?" అన్నది.



అలాదీన్ మంత్రికొడుకును చూపిస్తూ, "ఈ నిర్భాగ్యుణ్ణి పెంట పోగుపైన పడుకో బెట్టి నిద్ర పుచ్చు. మళ్లీ రేపు తెల్లవారు జామున కనబడు," అన్నాడు.

భూతమూ, మంత్రికొడుకూ మాయమైన అనంతరం, అలాదీన్ రాజకుమార్తె కేసి తిరిగి, "నేను నీకు ద్రోహం చేసే బుద్ధితో ఇక్కడికి తెప్పించలేదు. మీ తండ్రే నాకు ద్రోహం తలపెట్టాడు. నిన్ను నాకిచ్చి పెళ్లి చేస్తానని మాట ఇచ్చి, అందుకు గాను మూడు మాసాలు గడు వడిగి, ఆ గడువు దాటకముందే ఆయన మాట తప్పి, నిన్ను ఈ మంత్రి కొడుకు కిచ్చి పెళ్లి చేయ సిద్ధ

పడ్డాడు! అందుచేత నేను తప్పనిసరిఅయి ఇలా చేశాను," అన్నాడు.

పెళ్లి కోసం అలంకరించిన రాజభవనపు పడక గదిలో ఉన్న రాజకుమార్తె ఒక్క సారిగా ఒక పూరి ఇంట్లోకి మారిపోవటంచేత బెదిరిపోయింది. ఆమె ఆరాత్రల్లా కన్ను మూయలేదు. ఆమెను తన పక్కమీద పడుకోమని తనకూ ఆమెకూ మధ్య ఒక కత్తి అడ్డంపెట్టి అలాదీన్ సుఖంగానిద్రపోయాడు.

తెల్లారుజామున దీపంభూతం ఎవరూ పిలవకుండానే వచ్చేసింది. రాజకుమార్తెనూ, మంత్రికుమారుణ్ణీ రాజభవనానికి చేర్చమని అలాదీన్ భూతాన్ని ఆజ్ఞాపించాడు.

మరుక్షణం రాజకుమార్తే, మంత్రి కుమారుడూ రాజభవనంలో ఉన్నారు. తమను ఎవరు తెచ్చి చేర్చారో కూడా తెలుసుకునే అవకాశం వారికి లేకపోయింది.

రాజుగారు తన కుమార్తెను పిలిచి, "ఏమమ్మా, నీకూ నీ భర్తకూ అనుకూల దాంపత్యం కుదిరిందా ?" అని అడిగాడు. రాజకుమార్తె తండ్రికేసి బిత్తరపోయి చూసిందే గాని ఏమీ సమాధానం ఇవ్వలేదు. ఆయన ఆ ప్రశ్నే రెండుమూడుసార్లు అడి గాడు, కాని ఆమె సమాధానం చెప్పలేదు.

రాజు ఆగ్రహంతో రాణీవద్దకు వెళ్లి, "నీ భర్త నీకు అనుకూలంగా ఉన్నాడా అంటే



అమ్మాయి సమాధాన మివ్వదేమిటి ?" అని కోపంగా అడిగాడు.

" మీతో చెప్పటానికి సిగ్గుపడుతున్నది లెండి. నేనడిగి తెలుసుకుంటానుగా !" అన్నది రాణి.

కాని తల్లి ప్రశ్నలకుకూడా రాజకుమార్తె మొదట్లో సమాధానాలివ్వలేదు.

రాణి గాభరాపడి, "ఏం జరిగింది, తల్లీ? ఎందుకు జవాబు చెప్పవు ?" అన్నది.

దానికి రాజుకూతురు, "ఏం చెప్పేదమ్మా ? నేనూ నా భర్తా గదిలోకి అడుగు పెట్టిన మరుక్షణం ఎవరో మమ్మల్ని ఒక దిక్కుమాలిన ఇంటో చేర్చారు. ఆ మనిషి ఎవరో చూసే అవకాశంకూడా లేకపోయింది. తరవాత నన్ను ఒంటరిగా విడిచి, నా భర్తను ఎక్కడికో తీసుకుపోయారు. నా పక్కన ఎవరో యువకుడు పడుకున్నాడు. మా ఇద్దరికీ మధ్య ఒక కత్తి ఉంచాడు. నేను హడిలి చచ్చాను. మళ్ళీ తెల్లారే సమయానికి ఇక్కడ ఉన్నాం. అందుచేతనే నాన్న నన్ను అడిగితే ఏం చెప్పాలో నాకు తెలియలేదు," అన్నది.

" నాతో చెబితే చెప్పావు గాని ఈ సంగతి ఇంకెవరికన్నా చెప్పావంటే నీకు నిశ్చయంగా మతి పోయిందనుకుంటారు. మీ నాన్నతో నువేమీ అనకపోవటం ఒక విధంగా మేలే





అయింది. ఆయన ఇంకొకసారి అడిగినా ఏమీ చెప్పకు," అన్నది రాణి.

"నా మాటలు నువు నమ్మలేదులాగుంది. నాకు మతి పోలేదమ్మా. నా మాటలు నమ్మకపోతే పోనీ నా భర్తనడుగు," అన్నది రాజు కూతురు.

"ఏదో భ్రమ పడ్డావులే, తల్లీ. అదంతా మరిచిపో. నీ పెళ్లికని ఎన్ని వినోదాలు చేస్తున్నారో చూతువు గాని, సిద్ధంకా!" అంటూ రాణీ దాసీలను పిలిచింది. వారు రాజకుమార్తెను అలంకరించసాగారు.

ఈలోపల రాణీ రాజువద్దకు వెళ్లి, "అమ్మాయికి రాత్రి ఏదో పీడకలలు వచ్చి నట్లున్నవి. అంతకన్న మరేమీ లేదు. మీరు నిష్కారణంగా దానిపై ఆగ్రహించకండి!" అని చెప్పింది.

తరవాత ఆమె మంత్రికుమారుణ్ణి రహస్యంగా పిలిపించి, తన కుమార్తె చెప్పిన విషయాలన్నీ చెప్పి, "నిజంగా ఇలాగే జరిగిందా?" అని అడిగింది.

నిజం ఒప్పుకుంటే తనను చూసి అందరూ నవ్వుతారని మంత్రికొడుకు అన్నీ వట్టిదే నన్నాడు. తన కూతురికి పీడకలలో లేక భ్రాంతో కలిగివుంటుందని రాణి రూఢి చేసుకున్నది. రోజల్లా పెళ్లి సంబరాలు సాగాయి. పాడేవాళ్ళు పాడారు, ఆడేవాళ్లు ఆడారు. కాని రాజకుమార్తెలో కొంచెంకూడా ఉత్సాహం లేదు. గడచిన రాత్రి జరిగిన అనుభవాన్ని ఆమె మరవలేకపోయింది.

ఆ పగలల్లా అలాదీన్ నగరమంతా తిరిగి వినోదాలు చూశాడు. "మంత్రికొడుకు చేసుకున్న అదృష్టం! అతను రాజుగారికి అల్లుడయాడు!" అని అందరూ అనుకోవటం వింటే అలాదీన్‌కు నవ్వొచ్చింది. పెళ్లి రాత్రి యావత్తూ ఆ మంత్రికొడుకు పెంట కుప్ప మీద పడుకున్నాడని ప్రజలకు తెలియదు!

రెండో రాత్రికూడా అలాదీన్ రాజకుమార్తెను దీపంభూతం చేత తన గదికి





తెప్పించి, ఆమెకూ తనకూ మధ్య కత్తి అడ్డం పెట్టి పడుకున్నాడు. దీపం భూతం మంత్రి కుమారుణ్ణి పెంట కుప్పమీద పడుకోబెట్టింది. మళ్ళీ తెల్లవారగానే వాళ్ళిద్దరూ ఎప్పటిలాగే రాజభవనంలో ఉన్నారు.

రాజుగారు తన కూతురివద్దకు వెళ్లి, "అమ్మాయీ, ఎలా వున్నావు?" అని అడిగాడు. కాని రాజకుమార్తె జవాబు చెప్పక, తండ్రికేసి మరింత బెదురుగా చూసింది.

బెల్లంకొట్టిన రాయిలాగా తన కూతురు జవాబు చెప్పకపోవటం చూసి మండిపోయి, రాజు, "నిన్న చూశాను, ఇవాళ చూస్తున్నాను, అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పక అలా గుడ్లుపెట్టుకు చూస్తావేం? అంత పొగరెక్కిందా? చూడు, నిన్నేంచేస్తానో!" అంటూ కత్తిదూశాడు.

రాజకుమార్తె హడలిపోయింది. ఆమె కన్నీరు కారుస్తూ, "నాన్నా, నిజం తెలిస్తే నన్నుచూసి జాలిపడతావు గాని నామీద కోప్పడవు. నేను అసలే నరకం అనుభవిస్తున్నాను," అని రాజుతో జరిగినదంతా చెప్పింది. "ఇదంతా పెళ్లికొడుక్కుకూడా తెలుసు. నా మాటలో నమ్మకం లేకపోతే ఆయనను అడుగు," అన్నదామె. రాజుగారు తన కుమార్తెను చూసి జాలిపడి, "పిచ్చిదానా, ఈ సంగతి నిన్ననే చెప్పి ఉంటే రక్షకభటులను ఏర్పాటుచేసి, నీకు ఏ ప్రమాదమూ రాకుండా కాపాడి ఉందును గదా! ఇవాళ రాత్రికి నీకే అపదా కలగకుండా నేను చూస్తాను. జరిగినదంతా మరిచిపోయి నిశ్చింతగా ఉండు," అన్నాడు.

తరవాత ఆయన మంత్రిని పిలిపించి, "ఏమిటిదంతా? గడిచిన రెండు రాత్రుల సంఘటనలను గురించి నీ కొడుకు నీతో ఏమైనా చెప్పాడా?" అని అడిగాడు.

"మహారాజా, ఈ రెండు రోజులూ నేను నా కొడుకును కలుసుకోనే లేదు. నాకేమీ తెలియదు," అన్నాడు మంత్రి.



59

రాజు తన కుమార్తె తెలిపిన విషయా లన్నీ మంత్రికి చెప్పి, "అసలు ఏం జరిగి నదీ నీ కొడుకును అడిగి తెలుసుకో. నా కూతురు కంగారుపడి నిజం గ్రహించక పోయి ఉండవచ్చు," అన్నాడు.

మంత్రి తన కొడుకును పిలిపించి, రాజ కుమార్తె చెప్పిన విషయాలు చెప్పి, "ఇదంతా నిజమేనా ?" అని అడిగాడు.

"రాజకుమార్తె అబద్ధం చెప్పవలిసిన గతేం పట్టింది, నాన్నా ? నా సంగతి మరీ అన్యాయం. రెండు రాత్రులూ నేను పెంట కుప్పమీద పడుకున్నాను. చలికి ఎముక లన్నీ బిగుసుకుపోయాయి. నాకీ పెళ్లి వద్దు, నాన్నా. దీన్ని రద్దుచేయించు. ఇంకో రాత్రి నేనా పెంటకుప్పమీద పడుకోలేను, రాజు గారి అల్లుణ్ణి కాకపోయినా మానె!" అన్నాడు మంత్రికొడుకు.

ఈ మాట వినగానే మంత్రికి చాలా కష్టంవేసింది. ఈ పెళ్లి జరిగించటానికి ఆయన విశ్వప్రయత్నం చేసిఉన్నాడు. అందుచేత ఆయన తన కొడుకుతో, "నాయనా, నువు తొందరపడకు. ఈ రాత్రి ఏం జరుగుతుందో చూద్దాం. ఇలాటి అదృష్టం మళ్లీరమ్మంటే రాదు," అన్నాడు. తరవాత మంత్రి రాజుగారిదగ్గిరికి వెళ్లి, "మహాప్రభూ, రాజకుమార్తె చెప్పినదంతా నిజమే! మావాడుకూడా చెప్పాడు," అన్నాడు.

"అయితే ఈ పెళ్లిని ఇప్పుడే రద్దు చేస్తున్నాను," అంటూ రాజుగారు పెళ్లివేడుక లన్నీ ఆపవలసినదిగా ఉత్తరువిచ్చాడు.

పెళ్లి రద్దయిందని తెలియగానే ప్రజలు ఆశ్చర్యపడ్డారు. రాజుగారి ఇంటినుంచి మంత్రీ, మంత్రికొడుకూ కోపంగా వెళ్లి పోవటం జనం కనిపెట్టి, "ఏం జరిగింది ? పెళ్లి ఎందుకు రద్దయింది ?" అని అడగ సాగారు. కాని జరిగినదేమిటో అలాదీన్‌కు తప్ప మరెవరికీ తెలియదు.

(ఇంకా ఉంది)





# తాబేలు దర్పం

ఒకనాడు అరణ్యంలో సమారాధన జరిగింది. ఆనాడు అన్ని జంతువులూ తమ తమ విరోధాలను మరిచి ఒకచోట చేరాయి.

ఒకవంక పెద్ద పెద్ద గాడిపొయ్యిలమీద పెద్ద ఎత్తున వంట అవుతున్నది. వంటకు సహాయం చేసేవాళ్లు సహాయం చేస్తున్నారు. కొందరు కట్టెలు తెస్తున్నారు. కొందరు కూరలు తరుగుతున్నారు. కొందరు నీరు చేరవేస్తున్నారు. కొంతమంది ఒకచోట చేరి కబుర్లు సాగించారు.

ఉన్నట్టుండి మాటలమధ్య కుందేలు, "నాతో ఎవరూ పరిగెత్తలేరు. వేగానికి నాతరవాతనే ఇంకొకరు," అన్నది.

"తెలివితేటలకు నన్ను చెప్పి ఇంకొకరిని చెప్పాలి!" అన్నది నక్క.

"పరాక్రమానికి నాకెవరూ సాటిలేరు!" అన్నది తోడేలు. అంతావిన్న ఎలుగుబంటి గొంతు సవరించుకుని, "మిగిలిన విషయాల సంగతి నాకు అంతగా తెలీదుగాని బలంలోనూ, పట్టులోనూ నన్నెవరూ ఓడించలేరు!" అన్నది ధీమాగా.

తాబేలు ఏమీ మాట్లాడలేదు, ఒక్క చిరునవ్వుమాత్రం నవ్వింది.

ఇది గమనించిన ఎలుగుబంటి, తాబేలు తనను చూసే నవ్వుతున్నదనుకుని, "నా బలంమాట నేను చెబుతుంటే మధ్య నీకు వెటకారం దేనికి?" అన్నది కోపంగా.

తాబేలు ఇంకా పెద్దగా నవ్వి, "నవ్వక ఏం చెయ్యమన్నావు? నామీద పరుగు పందెంవేసిన కుందేలే గొప్పలు చెప్పకోగా లేందీ, నా బలం ఎరగని నువు గొప్ప చెప్పకోవటం అబ్బురమా ఏమిటి?" అన్నది.

ఎలుగుబంటి ఆశ్చర్యంతో కళ్లు పెద్దవి చేసి, "అయితే, యింతకూ నువ్వనేది నాకన్న నీకు ఎక్కువ బలం ఉన్నదనా?" అని అడిగింది.

టి. శంభుదాసు



"నీటిలో నా బలం యమబలం! నువు కాదుగదా, మీరందరూ కలిసినా నన్ను గెలవలేరు!" అన్నది తాబేలు.

"ఈ అవమానం నేను సహించను!" అన్నది ఎలుగుబంటి రౌద్రంగా.

"ఇంకా వంట కాలేదు. ఈలోపుగా ఒక పట్టు పట్టిచూడరాదా?" అన్నది తాబేలు. జంతువులన్నీ ఉత్సాహం చూపాయి.

"మోకు ఒకటి తెచ్చి ఒక చివర నా కాలికి కట్టండి. రెండో చివర ఎలుగుబంటి కివ్వండి. నేను నీటిలోకి పోయి పట్టు సంపాదించుకుని మోకును ఆడిస్తాను. అప్పుడు ఎలుగుబంటి నన్ను బయటికి లాగటానికి ప్రయత్నిస్తుంది. నన్ను బయటికి లాగితే ఎలుగుబంటి గెలిచినట్టు, లేకపోతే ఓడినట్టు!" అన్నది తాబేలు.

ఒక మోకు తెచ్చి దాని ఒక చివర తాబేలు కాలికి కట్టారు. తాబేలు మడుగులో ప్రవేశించి వెంటనే తన కాలికి కట్టి ఉన్న మోకును విప్పి ఒక మర్రిచెట్టు వేరుకు గట్టిగా బిగించి మోకును ఊపింది.

బయట ఉన్న ఎలుగుబంటి ఒక చేత్తో మోకును పట్టుకు లాగింది. మోకు బిగుసుకున్నదిగాని కదలలేదు. రెండు చేతులా పట్టి లాగింది. లాభంలేకపోయింది; మోకును వీపుమీదుగా వేసుకుని లాగింది. ఎలుగుబంటికి చేతులు రెండూ దోక్కుపోయాయి, భుజం ఒరుసుకు పోయింది, ముచ్చెమటలు పోశాయి, కాని తాబేలు బయటికి రాలేదు.

చివరకు ఎలుగుబంటి సొమ్మసిల్లి చతికిల బడింది. మోకు సడలటం గమనించి తాబేలు మోకును తిరిగి తన కాలికి కట్టుకుని మడుగులోనుంచి వస్తూ, "అమ్మో, ఏమో అనుకున్నాను. నీదికూడా సామాన్యమైన బలంకాదే! నువు గుంజిన అఖరు గుంజుకు నేను బయటికి వచ్చినంత పనీ అయింది!" అన్నది. ఈ మాటతో ఎలుగుబంటి విచారం కాస్తాపోయింది.






## 7

[బొందెతో పితృలోకానికి వెళ్ళి, అక్కడ గ్రీకు మృతవీరుల నెందరినో చూసి, సాంకేతికుడనే జ్ఞానిద్వారా భవిష్యత్తులో తనకు రాగల కష్టసుఖాలు తెలుసుకుని రూపధరుడు తన అనుచరులతో గృహోన్ముఖుడై, దారిలో నాగకన్యలను తప్పించుకుని, సూర్యభగవానుడి పశువుల మందలుండే దీవిని చేరాడు. అతని అనుచరులు ఆ పశువుల జోలికి పోమని ప్రమాణం చేసినమీదట ఆ రాత్రికి ఆ దీవిలో దిగటానికి రూపధరుడు ఒప్పుకున్నాడు.]

గ్రీకులు తమ పడవను ఒక రేవులాటి ప్రదేశం చేర్చి ఒడ్డుకు కట్టేశారు. ఆ సమీపంలోనే ఒక మంచినీటి జలకూడా ఉన్నది. తరవాత అందరూ తీరం మీదికి వెళ్లి వంట చేసుకుని భోజనాలు చేశారు. అనంతరం వారు విధ్వంసిని వాతపడిన తమ అనుచరులను తలుచుకుంటూ నిద్రపోయారు.

ఆ రాత్రి మూడవ జామున బ్రహ్మాండమైన ఉప్పెన అరంభమయింది. ఆకాశమంతటా మేఘాలు కమ్మాయి. దక్షిణం నుంచి తీవ్రమైన గాలి సాగింది. గ్రీకులు తమ నౌకను ఒడ్డుకు లాగి ఒక గుహలోకి ఈడ్చారు. రూపధరుడు తన అనుచరులతో, "మిత్రులారా, మన నౌకలో మనకు బోలెడంత ఆహారమూ, పానీయాలూ ఉన్నాయి. కనుక మనం ఈ దీవి మీద ఉండే పశువుల జోలికి పోవద్దు. అవి సూర్యభగవానుడివి. మనం ఆయనకు ద్రోహం చేసినట్టయితే





హోరుగాలి తగలని ఒక ప్రశాంత ప్రదేశంలో కూచుని దేవతలను ధ్యానించుతూ, అలాగే నిద్రపోయాడు.

ఈలోపుగా అక్కడ గుహలో మాయావి మిగిలిన గ్రీకులతో ఇలా అన్నాడు: "మిత్రులారా, మీరంతా చాలా దీనస్థితిలో వున్నారు. అందుచేత నేనొక్కమాట చెబుతాను వినండి. ప్రాణికి ఏవిధమైన చావన్నా భయమే. అయితే అన్ని చావులకన్న పరమ నీచమైన చావు ఆకలిచావు. కనుక మీరు కొంచెంకూడా సంకోచించవద్దు, పశువులను పట్టుకువద్దాం పదండి. మనం ఏనాటికైనా ఇథకా చేరితే అప్పుడక్కడ సూర్యభగవానుడికి గొప్ప ఆలయం కడదాం. ప్రస్తుతానికి మనం ఈ పశువులను తెచ్చి, యథావిధిగా స్వర్గంలోని దేవతలందరికీ బలులిచ్చి, వాటిని తిని మన ప్రాణాలు కాపాడుకుందాం. అప్పటికీ సూర్యభగవానుడు ఆగ్రహించి, మిగిలిన దేవతలు మనని అనుగ్రహించక, నడిసముద్రంలో మనం మునిగిపోతామా, పీడ విరగడ అయిపోతుంది. ఈ నిర్జనమైన దీవిలో ఆకలికి మాడి అనేక రోజులపాటు క్షీణించి చచ్చేకన్న ఇన్ని ఉప్పునీళ్లు మింగి చావటం ఎన్నోరెట్లు మేలుగదా!"

మన ప్రాణాలు దక్కవు! అందుచేత చాలా జాగ్రత్తగా ఉండండి!" అని గట్టిగా చెప్పాడు.

అతని అనుచరులకుకూడా అకారణంగా చావటం ఇష్టంలేదు; అందుచేత వారు తమ నాయకుడి హెచ్చరికను పాటించారు. నెల రోజులపాటు ఉప్పెనగాలి వీస్తూనే ఉన్నది. నౌకలో ఉన్న ఆహార పానీయాలు అయిపోయాయి. గ్రీకులు ఆహారంకోసం పక్షులను వేటాడవలిసి వచ్చింది, చేపలు పట్టవలిసి వచ్చింది. ఎవరి కడుపులూ నిండటంలేదు.

ఇది చూసి రూపధరుడు దేవతలను ప్రార్థించ నిశ్చయించాడు. అతను తనవారిని విడిచి దీవిలోపలికి చాలాదూరం వెళ్లి,





మాయావి మాటలు విని మిగిలినవాళ్లు పరమానందం చెందారు. వారు ఏమాత్రమూ సంకోచించక, వెంటనే బయలుదేరి వెళ్ళి ఆ దీవిలో వున్న పశువులలో మంచి మంచి వాటిని ఏరి తోలుకువచ్చి, శాస్త్రోక్తంగా దేవతలకు బలులిచ్చి వాటి మాంసంతో వంట ప్రారంభించారు.

ఈలోపుగా రూపధరుడు నిద్ర లేచి తన వారిని చేరుకోవటానికి బయలుదేరి రాసాగాడు. అతను తీరానికి అంత దూరాన వుండగానే మాంసం వండుతున్న వాసన కొట్టింది. తన అనుచరులు సూర్యభగవానుడిపట్ల అత్యాచారం చేశారని అతనికి తెలిసిపోయింది. అతను వారిని మందలించాడు. కాని జరగవలసిన అపచారమేదో జరిగేపోయింది. పశ్చాత్తాపపడి చేయగలది కూడా ఏమీలేదు.

తాము చంపి వండుకున్న పశువుల మాంసాన్ని గ్రీకులు ఆరు రోజులపాటు తిన్నారు. ఏడవ రోజుకల్లా ఉప్పెనగాలి నిలిచిపోయింది. వెంటనే రూపధరుడూ అతని అనుచరులూ తమ నౌకను సముద్రం మీదికి తెచ్చి, అందులో ఎక్కి ప్రయాణమైనారు. కొంతసేపటికి సూర్యభగవానుడి మంద లుండే దీవి కనుచూపుమేర దాటి



పోయింది. ఎటు చూసినా సముద్రమూ ఆకాశమూ తప్ప ఇంకేమీ కనిపించటంలేదు.

అలాటి సమయంలో నడిఆకాశం మీదికి ఒక కారుమేఘం వచ్చింది. పడమటినుంచి ఒక్క పెట్టున భయంకరమైన హోరుతో ప్రళయమైన గాలి విసిరింది. దాని దెబ్బకు తెరచాపస్తంభం ఫెళ్ళున విరిగి చుక్కాని పట్టేవాడి శిరస్సుమీద పడింది. వాడు చచ్చి సముద్రంలో పడిపోయాడు. అదే సమయంలో నేరుగా పడవపైన పిడుగుపడింది. ఆ దెబ్బతో పడవ కాస్తా ఛిన్నాభిన్నమై పోయింది. రూపధరుడి అనుచరు లందరూ సముద్రంపాత పడిపోయారు.




65





అయితే రూపధరుడికి తన నౌకతాలూకు వెన్నుదూలం దొరికింది. అతను దానికి తెర చాప స్తంభాన్ని అంటగట్టి, దానిపై తేలి వెళ్ల సాగాడు. ఇంతలోనే పడమటి గాలి నిలిచి పోయి దక్షిణపు గాలి ప్రారంభమయింది. తాను మళ్ళీ సుడిగుండంవేపు వెళ్లి ఆ సుడి గుండంలో మునిగిపోవటమో, విధ్వంసిని అనే రాక్షసివాత పడటమో జరుగుతుందని రూపధరుడు చాలా భయపడ్డాడు. అతను భయపడినట్టే తెల్లవారే సమయానికి అతని తెప్ప సుడిగుండం వద్దకు వచ్చింది. కాని అదృష్టవశాన అతను రెండు ప్రమాదాలనూ తప్పించుకున్నాడు.

రూపధరుడు తొమ్మిది రోజులపాటు ఈ విధంగా గాలికి కొట్టుకుపోయి పదవనాటి రాత్రి ఒగీజియా అనే దీవిపై వచ్చిపడ్డాడు. ఈ దీవిపై సమ్మోహిని అనే దేవత ఒక గుహలో నివసిస్తున్నది. ఆ గుహచుట్టూ గల పరిసరాలు చాలా అందంగా వున్నాయి. గుహచుట్టూ అడవి పొదలున్నాయి. వాటి చుట్టూ పచ్చిక మైదానాలూ, అందమైన సెలయేళ్ళూ వున్నాయి. గుహ ద్వారం మీదుగా ద్రాక్షతీగెలు పాకుతున్నాయి. వాటి నుంచి ద్రాక్షపళ్లగుత్తులు వేలాడుతున్నాయి.

రూపధరుడు ఆ దీవిపై అడుగుపెట్టి, తూలుతూ నడుస్తూవస్తున్న సమయంలో సమ్మోహిని అతనికి ఎదురువెళ్ళి, స్వాగతం చెప్పి, తన గుహకు తెచ్చింది. అతనికి ఆహారమూ, తాగటానికి మంచి సారా ఇచ్చింది. "నీవు ఎప్పటికీ ఇక్కడే నా భర్తగా ఉండిపోయినట్టయితే, నీకు చావూ, ముసలితనమూ లేకుండా చేస్తాను," అని ఆమె వాగ్దానం చేసింది.

ఆ దీవిలో ఆమెను ధిక్కరించి రూపధరుడు చేయగలిగినదేమీ లేదు. అతను ఆమె ఇష్టప్రకారమే ఆమెను పెళ్లాడి అయిదేళ్ళ పాటు ఆ దీవిపై వుండిపోయాడు. అయితే రోజులు గడుస్తున్నకొద్దీ అతనికి స్వదేశానికి



వెళ్ళాలన్న కోరిక హెచ్చిందిగాని తగ్గలేదు. అతను రోజల్లా సముద్రతీరాన దిగులుగా కూచునే వాడు.

అతను తన స్వదేశాన్ని మరిచిపోయే లాగు చేయుటం తనవల్ల కాదని తెలుసుకుని సమ్మోహిని ఒకనాడు అతనివద్దకు వచ్చి, "నిన్నుచూస్తే జాలివేస్తున్నది. నేను నిన్ను పంపెయ్యటానికి నిశ్చయించాను, దిగులు పడకు, లేచి చెట్లు నరికి తెప్ప ఒకటి తయారుచేసుకో. నీకు కావలిసినంత ఆహార పానీయాలిస్తాను, బట్టలిస్తాను, అనుకూల వాయుపుకూడా ఇస్తాను. వాటి సహాయంతో ఇంటికి వెళ్ళిపో !" అన్నది.

ఈ మాటలు వినేసరికి రూపధరుడి శరీరం జలదరించింది. "ఇందులో ఏదో మోసం ఉన్నది. లేకపోతే ఈ మహాసముద్రాన్ని తెప్పమీద దాటమని నువు నాకు సలహా ఇయ్యావు. బాగా నిర్మించిన నౌకలకే దిక్కు లేదు. అందుచేత నువు పూర్తి సమ్మతితో సహాయపడి పంపుతున్నావని నాకు నమ్మకం కలిగితే తప్ప నేను వెళ్లను," అన్నాడతను.

"నీ బుద్ధి వక్రబుద్ధి. అందుకే నీ కంత అనుమానం కలిగింది. కావలిస్తే ప్రమాణం చేస్తాను. నీకు సహాయపడాలనే నా ఉద్దేశం. నాది రాతిగుండె అనుకున్నావా ? నిన్ను



చూస్తే నాకు చాలా జాలిగా ఉంది," అన్నది సమ్మోహిని.

ఆమె అతన్ని తన గుహకు తీసుకు వెళ్లి సమస్తమైన భోజనపదార్థాలూ వడ్డించి భోజనం పెట్టింది. తరవాత ఆమె అతనితో, "నీకు ఇంటికి వెళ్ళాలని ఉండటం మంచిదే గాని, దారిలో ఎన్ని కష్టాలున్నాయో తెలిస్తే నువు నన్ను విడిచి వెళ్లవు. ముసలి తనమూ, చావూ లేకుండా ఇక్కడే ఉండి పోతావు," అన్నది.

దానికి రూపధరుడు, "ఇంటికి వెళ్ళాలని ఎంతో కాలంగా ఎదురుచూస్తున్నాను. ఇప్పటికే ఆ ప్రయత్నంలో అష్టకష్టాలూ





67





పడ్డాను. ఒకవేళ దారిలో నా తెప్ప మునిగి పోతే నేను పడిన కష్టాలకు మరొకటి జత అవుతుంది. అంతకన్న ఏమున్నదీ? నేను చాలా ఓర్పుగల మనిషిని!" అన్నాడు.

మర్నాడు తెల్లవారుతూనే సమ్మోహిని రూపధరుడికి రెండువేపులా పదును గల ఒక కంచుగొడ్డలీ, బాడితా ఇచ్చి, తనవెంట అతన్ని ఆ దీవి చివరకు తీసుకుపోయింది. అక్కడ చాలా ఎత్తయిన చెట్లు గల తోపు ఒకటి ఉన్నది. రూపధరుడు ఇరవై చెట్లు నరికి, బాడితతో సాఫుచేసి చిన్నపడవ నిర్మించాడు. దానికి ఒక చుక్కానీ, తెరచాప స్తంభమూ అమర్చాడు. తెరచాపగా ఉపయోగించటానికి పనికివచ్చే వస్త్రాన్ని సమ్మోహిని ఇచ్చింది. తెప్పపడవను రూపధరుడు సముద్రంమీదికి చేర్చాడు.

ఇదంతా నాలుగు రోజులు పట్టింది. అయిదవరోజు సమ్మోహిని రూపధరుడిచేత స్నానంచేయించి, ప్రయాణానికి అవసరమైన ఆహారపదార్థాలూ, తిత్తులనిండా మంచి నీరూ, సారాపోసి ఇచ్చింది. రూపధరుడు తన తెప్పమీదికి ఎక్కి చుక్కాని పట్టుకుని కూచున్నాడు. అతనికి అనుకూలంగా మెల్లని గాలి సాగింది. రాత్రి అతను నిద్రపోక నక్షత్రాల సహాయంతో తెప్పను నడపసాగాడు. అతను సముద్రం మీద బయలుదేరేటప్పుడు సమ్మోహిని, "సప్తమహర్షులు నీ ఎడమచేతి వైపున వుండేటట్టుగా ప్రయాణం చెయ్యి," అని హెచ్చరించింది.

రూపధరుడు పదిహేడు రోజులపాటు ప్రయాణించాక సముద్రంమీద మళ్ళీ బ్రహ్మాండమైన తుఫాను బయలుదేరింది. ఆకాశంనిండా మబ్బులు కూడాయి. ప్రచండమైన గాలి సాగింది. రూపధరుడు తన చావు దగ్గిరపడిందనుకున్నాడు.

"నేనెంత అదృష్టహీనుణ్ణి! ట్రోయ్ యుద్ధంలో చనిపోయినవారు నాకన్న ఎన్నో రెట్లు అదృష్టవంతులు. వారి శవాలకు





సంస్కారం జరిగింది. ఈ నడిసముద్రంలో ఒంటరిగా దిక్కులేని చావు చచ్చేకన్న, వజ్రకాయుడు చచ్చినప్పుడే నేనూ పోయి ఉంటే ఎంత బాగుండేది!" అని అతను అనుకున్నాడు.

ఇంతకూ దేవతలు అతనిపై కత్తికట్టారు. గాలిఊపుకు చుక్కాని అతని చేతిలో నుంచి లాగేసినట్టుగా పోయింది. మరుక్షణం తెప్ప గుండ్రగా తిరిగింది. రూపధరుడు తెప్ప మీదినుంచి నీటిలో పడిపోయాడు. అతని దుస్తులు తడిసి బరువెక్కటంచేత అతను నీటి అడుగునుంచి త్వరగా పైకి రాలేక పోయాడు. ఆ బట్టలను ఎలాగో వదిలించుకుని అతను పైకి తేలి మళ్ళీ తన తెప్పను పట్టుకుని, దానిపైకి ఎక్కి కూచున్నాడు. అలల తాకుడుకు తెప్ప ఇంకా గుండ్రగా తిరుగుతూ, సముద్రంమీద బంతిలాగా అటూయిటూ కొట్టుకుంటున్నది.

ఈ సమయంలో రక్షికి అనే ఒక దేవతా స్త్రీ సముద్రపు పక్షిరూపంలో ముక్కున ఒక వస్త్రం పట్టుకుని వచ్చి అతని తెప్ప అంచున వాలి, "రూపధరా, నీకు ప్రాణ భయం లేదు. నిన్ను దేవతలు పీడించ గలరు గాని చంపలేరు, నువు ఇంటికి చేరు కుంటావు. అయితే ఈ తెప్ప కేవలం నిరుప



యోగం. అందుచేత ఈ వస్త్రాన్ని నీ రొమ్ము చుట్టూ చుట్టుకుని నీటిలో దూకు. అలా చేసినట్టయితే నువు మునగవు. క్షేమంగా ఒడ్డు చేరుకుంటావుకూడా!" అన్నది.

రూపధరుడికి ఆ మాటలలో కొంచెం కూడా గురి కుదరలేదు. "నా కింకా కొత్త కష్టాలు తెచ్చిపెట్టటానికి ఇది పన్నాగం లాగుంది. మిన్ను విరిగి మీద పడినా సరే నేనుమాత్రం ఈ తెప్పను వదలను!" అను కుని అతను గట్టిగా తెప్పను అంటిపెట్టుకుని కూచున్నాడు.

కాని మరి కాస్సేపట్లో పెద్ద అల వచ్చి అతని తెప్పను ముక్కలుముక్కలు చేసే



సింది. అతనికి ఒక చిన్న దుంగ మాత్రమే దొరికింది. గుర్రాన్ని ఎక్కినట్టు అతను దానిమీద ఎక్కి కూచుని, రక్షకి చెప్పిన ప్రకారమే ఆ వస్త్రాన్ని తన రొమ్ము చుట్టూ చుట్టుకున్నాడు. తరవాత అతను నీటిమీద బోర్లా పడుకుని, తన నిడుపైన చేతులతో ఈదసాగాడు.

అతనా కల్లోల సముద్రంలో రెండు రోజులపాటు ఈదాడు. మూడవనాడు తెల్లవారేసరికి తుఫాను నిలిచిపోయింది. అంత దూరాన రూపధరుడికి తీరం కనిపించింది. ఇక తన కష్టాలు గడిచాయనుకుని రెట్టింపు ఉత్సాహంతో అతను తీరంకేసి ఈదసాగాడు. కాని ఆ తీరానకూడా తనకు ప్రాణభయం ఎదురుకాబోతున్నదని అతనికి వెంటనే అర్థమయింది.

ఎందుచేతనంటే ఆ తీరమంతా శిలామయం. సముద్రకెరటాలు ఆ శిలల మీదికి ఉరికి నురుగులు కక్కుతున్నాయి. వాటి హోరు అతనికి వినిపిస్తున్నది. అలలు తనను ఆ రాళ్ళగుట్టల మీదికి విసిరికొట్టితే తన గతి ఏంకాను?

అతను అనుకున్నంతా అయింది. ఒక బలమైన అల అతన్ని అవలీలగా లేవదీసుకుని, అమిత వేగంగా రాళ్ళగుట్టల మీదికి లాక్కుపోయింది. అతను ఒక రాతిని బలంగా వాటేసుకున్నాడు. కాని ఆ అల తిరిగి వచ్చేటప్పుడు అతన్ని బలాత్కారంగా తీసుకుని మళ్లీ సముద్రంవేపు ఈడ్చింది. ఆ లాగుడుకు అతని రెండు చేతులూ ఘోరంగా దోక్కుపోయాయి.

ఈసారి రూపధరుడు తీరంకేసి ఈదటం మానేసి తీరంచుట్టూ ఈదసాగాడు. ఇలా కొంతదూరం ఈదాక అతనికి ఒక నదీ ముఖం ఎదురయింది. అతనికి ప్రాణం లేచివచ్చింది. తనను కాపాడమని నదిని ధ్యానిస్తూ అతను నేలమీదికి వచ్చి, వెంటనే స్పృహతప్పి పడిపోయాడు.—(ఇంకా వుంది)





# మేకు విలువ

పూర్వం ఒక గ్రామంలో ఒక పేదయువకు డుండేవాడు. అతని పేరు గోవిందుడు. అతనికి పెళ్లి అయింది, ఇద్దరు పిల్లలుకూడా కలిగారు. కాని భూవసతి కొంచెమైనా లేక పోవటంచేత గోవిందుడు వారిని తన రెక్కల కష్టంమీద పోషించవలిసి వచ్చింది. ఇందుకుగాను అతను రహదారిన బస్తీకి నడిచివెళ్లి, ఏదైనా కూలీనాలీ చేసి డబ్బులు సంపాదించి, ఆ డబ్బుతో ఇంటికి కావలిసిన వెచ్చాలు తెచ్చుకుంటూ ఉండేవాడు.

వస్తుతః గోవిందుడు పొదుపు ఎరిగిన వాడు. అతని చిన్నతనంలో అతని తండ్రి, "నాయనా, ప్రతి చిన్నవస్తువుతోనూ ఎప్పుడో ఒకప్పుడు అవసరమైన పని ఉంటుంది," అని చెప్పేవాడు. గోవిందుడు తన తండ్రి చెప్పిన పాఠాన్ని మరిచిపోలేదు.

ఒకనాడు అతను రహదారిన బస్తీకి నడిచిపోతూండగా అటుగా మంత్రికొడుకు గుర్రం ఎక్కి శరవేగంగా వచ్చాడు. గోవిందుడు చూస్తుండగానే గుర్రం కాలి లాడం తాలూకు మేకొకటి జారి, తళుక్కున మెరిసి దారిలో పడిపోయింది.

"బాబూ, లాడంమేకు పడిపోయింది!" అని గోవిందుడు ఎలుగెత్తి అరిచాడు.

మంత్రికొడుకు వెనక్కు తిరిగిచూసి, నిర్లక్ష్యంగా చెయ్యి ఊపి ముందుకు వెళ్లాడు. ఒక లాడంమేకుకోసం వెనక్కు వెళ్లటం అతనికి పరువులోప మనిపించింది. అదీ గాక అతను అరణ్యంలోనుంచి వెళ్లే అడ్డ దారిన నగరానికి వెళుతున్నాడు; అందు చేత ఆ మేకు లేనందువల్ల పెద్ద ఇబ్బంది ఏమీ ఉండదనుకున్నాడు.

కాని ఈ విషయంలో మంత్రికొడుకు చాలా పొరపడ్డాడు. అతను అరణ్యంలో అటే దూరం పోకముందే గుర్రం కాలి లాడం వదులై ఊడివచ్చింది. గోవిందుడి

పి. గోవిందరావు



దగ్గిర మేకు తీసుకుని ఉండినట్టయితే మంత్రికొడుకు ఏదో ఒక విధంగా లాడాన్ని మళ్లీ బిగించి ఉండేవాడే. కాని లాడం లేక గుర్రం కుంటుతూ ఉండటంచేత అతను గుర్రం దిగి నడవవలిసి వచ్చింది. అతను అరణ్యంకుండా నడిచిపోతూ ఉండటం చూసి దొంగలు అతనిమీద పడి, నిలువు దోపిడి చేసి, అతన్ని ఒక చెట్టుకు అంట గట్టి పారిపోయారు.

ఈలోపల గోవిందుడు లాడంమేకు తీసి తనవద్ద ఉంచుకుని ముందుకు సాగాడు. అతను కొంతదూరం వెళ్లేసరికల్లా ఒక బండి దారిలో ఒరగబడిఉండటం కనిపించింది. శాయిమేకు పోవటంచేత ఒక బండిచక్రం ఊడి వచ్చేసింది. బండిపక్కన ఒక ధని కుడు నిలబడి ఉన్నాడు.

ఆయన గోవిందుణ్ణి చూడగానే, "అబ్బీ, నీదగ్గిర ఏదైనా మేకున్నదా? నేను త్వరగా నగరం చేరాలి. మధ్యదారిలో ఎక్కడో శాయిమేకు పడిపోయింది. ఈ దిక్కు మాలిన ప్రదేశంలో ఇంత ఇనపముక్క కూడా ఉన్నట్టు కనబడదు!" అన్నాడు.

గోవిందుడు తనవద్ద ఉన్న లాడంమేకు తీసి దాన్ని చక్రం ఇరుసులోకి రాతితో దిగ వేశాడు. చక్రం గట్టిగానే పట్టింది. ధనికు డికి ప్రాణం లేచివచ్చినట్టయింది.

"నువుకూడా నగరానికే పోతున్నావేమో, బండిలో రా!" అంటూ ధనికుడు గోవిం దుణ్ణి తనవెంట నగరానికి తీసుకుపోయి అతని చేతిలో ఒక బంగారుకాసు పెట్టాడు.

ఆ కాసు చూడగానే గోవిందుడి కళ్లు పెద్దవి అయాయి. అది తన కుటుంబానికి రెండు మాసాలు సరిపోతుంది. తన తండ్రి ఏనాడో అన్నమాట ఇప్పుడు అక్షరాలా నిజ మైంది; ఒక చిన్న లాడంమేకు బంగారు కాసు తెచ్చిపెట్టింది!

గోవిందుడు నగరంలో తన కుటుంబానికి నెలరోజులు సరిపడే సరుకులు కొని ఒక

గోతంలో వేసుకుని, దగ్గరదారిగదా అని అరణ్యంకుండా ఇంటికి రాసాగాడు.

అతను కొంతదూరం వచ్చేసరికల్లా దారికి ఒక పక్కనున్న చెట్లవెనక నుంచి ఏవో ఆర్తనాదాలు వినిపించాయి.

గోవిందుడు తన గోతాన్ని గుర్తుగా ఒక చోట పొదల మధ్య దాచి చెట్లలో ప్రవేశించాడు. అతను చాలాసేపు నడిచాక ఒక చోట ఆరుగురు పిల్లలూ ఒక స్త్రీ కనిపించారు. అందరూ దీనస్థితిలో ఉన్నారు.

ఆ స్త్రీ ఒక కోటీశ్వరుడి భార్య. పిల్లలందరూ ఆమె సంతతి.

"మొన్న సాయంకాలం మేమంతా కలిసి అరణ్యంలో విహారానికి వచ్చాం. మా పిల్లలు పూలకోసం అడవిలో జొరబడ్డారు. వాళ్ళెక్కడ తప్పిపోతారో అని నేనుకూడా వాళ్ళవెంటే వెళ్ళాను. ఇంతలో పొద్దూకింది. మాకు దారి తెలియలేదు. ఆ రాత్రంతా తిండి లేకుండా దారి వెతుకుతూ తిరిగాం. నిన్నసల్లా మాకు దారి దొరకలేదు. అన్నమూ నీళ్లూ లేకపోవటంచేత మాకు తిరిగే శక్తి కూడా పోయింది. ఇక్కడినుంచే కేకలు పెట్టాం. మా మొర ఆలకించినవాళ్ళు లేరు. ఇవాళ నువు దేవుడల్లే వచ్చావు!" అన్నది కోటీశ్వరుడి భార్య.



"మీకు వచ్చిన భయమేమీ లేదు. నేను మీకు దారి చూపిస్తాను, నా వెంట రండి!" అన్నాడు గోవిందుడు.

"నాయనా, మేం అడుగు తీసి అడుగు పెట్టే స్థితిలో లేం. మాకిప్పుడు కావలసింది పట్టెడన్నం!" అన్నదా స్త్రీ.

"అయితే ఉండండి, ఇప్పుడే వస్తాను!" అంటూ గోవిందుడు పరిగెత్తి వెళ్ళి తన సంచీ తెచ్చాడు. అందులో తన పిల్లలకోసం తెచ్చిన తినుబండారాలూ, మిఠాయీ ఉన్నాయి. వాటిని అతను కోటీశ్వరుడి పిల్లల కిచ్చి, తనదగ్గిర ఉన్న పదార్థాలతో ఆ అడవిలోనే వంట చేశాడు. కొద్దిసేపటిలో

అందరూ అన్నాలు తిన్నారు. పోయిన ప్రాణాలు లేచివచ్చినట్టయింది వారికి. వారిని వెంటబెట్టుకుని గోవిందుడు దారిదాకా తెచ్చి, "ఇక నాకు సెలవిప్పించండి!" అన్నాడు.

"అమ్మయ్యో, మేం ఇల్లు చేరలేం! మమ్మల్ని ఇల్లుచేర్చి మరీ వెళ్ళు!" అన్నది కోటీశ్వరుడి భార్య. ఆమె తన పిల్లలతో సహా ఇల్లు చేరి గోవిందుణ్ణి పంపేస్తూ, అతని చేతిలో ఒక చిన్న సంచీ పెట్టింది.

గోవిందుడు దాన్ని విప్పి చూసుకుంటే అందులో ఎనిమిది బంగారు కాసులున్నాయి. వాటిని చూసి అతని కళ్ళు మరీ పెద్ద వయాయి. ఒక్క లాడంమేకు ఇంత డబ్బు తెస్తుందని అతను కలలోకూడా అనుకోలేదు. అతను మరికొన్ని సరుకులు కొనుక్కొని అడవిదారిన బయలుదేరాడు.

అడవి నడిమధ్యకు చేరుకునేసరికి అతనికి సమీపంనుంచి మనిషి మూలుగు విని పించింది. అతను ఆ మూలుగు వినిపించిన దిక్కుగా వెళ్ళి, చెట్టుకు కట్టేసి శోషపడి వున్న మంత్రికొడుకును చూచాడు.

మంత్రికొడుకు హీనస్వరంతో తనకు జరిగిన ప్రమాదంగురించి గోవిందుడికి చెప్పాడు. గోవిందుడు అతని కట్లు విప్పి నడిపించుకుంటూ తన ఇంటికి తీసుకు పోయి కడుపునిండా తిండిపెట్టించాడు.

"బాబూ, తమరు లాడంమేకు లేని కారణంచేత ఎంత నష్టపోయారో, నేను దానితో అంత లాభం పొందాను," అంటూ గోవిందుడు తన కథ యావత్తూ చెప్పాడు.

అంతా విని మంత్రికొడుకు, "చూడు, గోవిందూ! సరిగా నీవంటి వాడొకడు నన్ను కనిపెట్టి ఉండటానికి నౌకరుగా కావాలి. నావెంట నగరానికి వచ్చెయ్యి. నీకు మంచి ఇల్లూ, జీతమూ ఇస్తాను!" అన్నాడు.

ఆ రోజే గోవిందుడు తన కుటుంబాన్ని తీసుకుని నగరానికి వెళ్ళి మంత్రికుమారుడి వద్ద కొలువులో ప్రవేశించాడు.



# అందరికీ ఒకటే న్యాయం!

ఒక గ్రామాధికారి కింద ఒక పశువులకాపరి ఉండేవాడు. వాడికి ఒక ఆవు ఉండేది. వాడు తన ఆవును తన యజమాని ఆవులతోబాటు రోజూ మేతకు తోలుకుపోతూ ఉండేవాడు.

ఒకనాడు దురదృష్టవశాత్తూ గ్రామాధికారి ఆవు ఒకటి పశువులకాపరి ఆవుతో తలపడింది. రెండూ పోట్లాడుకొన్నమీదట పశువులకాపరి ఆవు గ్రామాధికారి ఆవును చంపేసింది.

పశువులకాపరి వెంటనే గ్రామాధికారివద్దకు వెళ్లి, "అయ్యా, మీ ఆవు నా ఆవుతో పోట్లాడి చంపేస్తే న్యాయంగా దానికి పరిహారం ఏమిటి?" అన్నాడు.

గ్రామాధికారి తొణకకుండా, "దానికి పరిహారం ఉండదురా, అబ్బి! పోట్లాడుకోవటమూ, చంపుకోవటమూ పశుధర్మం. దానికి ఎవరూ ఏమీ చేయలేరు!" అన్నాడు.

"మీరు సరిగా వినలేదులాగుంది. నా ఆవు మీ ఆవును చంపింది. నన్ను పరిహారం అడుగుతారేమోనని భయపడాను. బతికించారు!" అన్నాడు పశువులకాపరి.





# అత్యాశ

ఒకానొక దేశంలో ఒక పేదవాడుండే వాడు. వాడు చుట్టుపక్కల గ్రామాలన్నీ తిరిగి అడుక్కుతింటూ ఉండేవాడు. పొలాలలో పనులు జరిగే రోజుల్లో కూలిజనం తాము తినేదాన్లోనే వాడికి ఇంత ఇచ్చేవారు. కాని ఆ తరవాత వాడికేమీ దొరికేదికాదు. ఇళ్లకు పోయి అడుక్కున్నా కుక్కలు మీద పడేవే తప్ప ఆశే ప్రయోజనం ఉండేది కాదు. అటువంటప్పుడు వాడు రోజుల తరబడి తిండికి మాడేవాడు.

ఒక యేడు ఆ బిచ్చగాడికి ఇదే గతి పట్టింది. రెండు రోజులపాటు తిండి లేని స్థితిలో వాడు ఒక గ్రామం నుంచి ఇంకో గ్రామానికి బయలుదేరాడు. దారిలో ఒక ముసలివాడు ఎదురుపడి, "పాపం, డొక్క అంటుకుపోయినట్టుంది. ఇంద, ఈ శనగ గింజ తీసుకో!" అంటూ బిచ్చగాడి చేతిలో ఒక శనగగింజ పెట్టాడు.

"దీంతో కడుపు నిండుతుందా, బాబూ?" అన్నాడు బిచ్చగాడు.

"దీన్ని తినేస్తే నీకేం లాభం? ఇది నీవద్ద ఉన్నదంటే ఎవరుపడితే వారు నీకు ఆతిథ్యమిస్తారు. అప్పుడు నువు తిండికి మాడవలిసిన అవసరం ఉండదు," అన్నాడు ముసలివాడు.

తరవాత ఎవరిదారిన వారు వెళ్లారు. చీకటిపడే వేళకు బిచ్చగాడు పక్కగ్రామం చేరుకుని ఒక ఇంటిముందు నిలబడి, "కాస్త అన్నం పడేయించండి, నాయనా!" అని కేక పెట్టాడు.

వెంటనే ఇంటి యజమాని బయటికి వచ్చి బిచ్చగాణ్ణి చూసి, తమ గ్రామంవాడు కాడని తెలుసుకుని లోపలికి పిలుచుకు వెళ్లి కడుపునిండా భోజనం పెట్టించాడు. "ఇవాళ రాత్రికి నువు మా ఇంటి పంచలోనే పడుకోవచ్చు. ఈ చీకట్లో యిప్పుడు

డి. కృష్ణవేణి



ఎక్కడికి పోతావు?" అన్నాడు ఇంటి యజమాని బిచ్చగాడితో.

బిచ్చగాడికి పరమానందమయింది. వాణ్ణి ఎవరుకూడా ఎన్నడూ ఇంత ఆదరంతో చూడలేదు. ఇదంతా శనగగింజ ప్రభావమే అయిఉండాలని వాడనుకున్నాడు. ఆ శనగ గింజను భద్రంగా తన తలకు దగ్గిరిగా ఉంచి, ఆ రాత్రి వాడు ఇంటి పంచలో పడుకుని సుఖంగా నిద్రపోయాడు.

తెల్లవారుజామున ఇంటివాళ్ల కోడి బిచ్చగాడు పడుకునిఉన్న చోటికి వచ్చింది. అది చేసిన చప్పుడుకు బిచ్చగాడు నిద్ర లేచాడు. అంతలోనే ఆ కోడి కాస్తా శనగ గింజను ముక్కుతో పట్టుకుని మరుక్షణం లోనే మింగేసింది.

"అయ్యో, నా శనగగింజ! కోడి మింగే సింది!" అని బిచ్చగాడు గట్టిగా శోకాలు పెట్టసాగాడు.

ఇంటి యజమాని ఈ కేకలు విని వచ్చి, జరిగిన సంగతి తెలుసుకుని, "ఒక్క శనగ గింజకోసం ఇంత విచారించాలా? సోలెడు గింజలిస్తాను, పట్టుకు పో!" అన్నాడు.

"నాకు సోలెడు శనగలు అక్కర్లేదు, నా గింజే కావాలి. అది అదృష్టం గల గింజ. దాన్ని నాకొక సిద్ధుడిచ్చాడు," అన్నాడు బిచ్చగాడు.





"అలా అయితే నేనేం చేసేది! ఆ శనగగింజ కోడిపాట్టలో ఉన్నదిగదా? అందుచేత ఆ కోడినిస్తాను, తీసుకు పో!" అన్నాడు ఇంటి యజమాని.

కోడిని బస్తీలో అమ్మితే నాలుగు డబ్బులు వస్తాయన్న ఆశతో బిచ్చగాడు కోడిని తీసుకుని ఆ గ్రామంనుంచి బయలుదేరాడు. అతను ఆ రోజు బస్తీ చేరుకోలేకపోయాడు. అందుచేత ఆ రాత్రికి ఒక ఆసామీని ఆతిథ్యం అడిగాడు. ఆసామీ సంతోషంగా సమ్మతించాడు.

బిచ్చగాడు ఆ రాత్రి మళ్లీ సుఖంగా భోజనంచేసి, తన కోడిని పక్కనే పెట్టుకుని పడుకున్నాడు. వాడికి కాస్త కునుకుపట్ట గానే వాడి కోడి దొడ్లోకి వెళ్లి ఇంటివాళ్ల కోళ్లతో జగడం పెట్టుకున్నది. అవి అన్నీ ఏకమై బిచ్చగాడి కోడిని పొడిచి తరమ సాగాయి. వాటినుంచి తప్పించుకుని పారి పోయే ప్రయత్నంలో బిచ్చగాడి కోడి ఒక పెయ్యదూడ కాళ్లసందున దూరి, దాని కాలికింద పడి చచ్చిపోయింది.

"అయ్యో, నా కోడి! నా బంగారు కోడి!" అని బిచ్చగాడు ఆవేశంగా అరవ సాగాడు. వాడికి ఆతిథ్యం ఇచ్చిన ఆసామీ రెండు కోళ్లిస్తానన్నా వినక బిచ్చగాడు పెయ్యదూడ నిమ్మన్నాడు. ఆసామీ ఒప్పుకుని పెయ్యదూడ నిచ్చేశాడు. దాన్ని పలుపుతో కట్టి తన వెంటబెట్టుకుని బిచ్చగాడు బస్తీకి బయలుదేరాడు.

వాడు బస్తీలో అడుగు పెట్టేలోపలనే పొద్దూకిపోయింది. అందుచేత ఊరిబయట ఉన్న ఒక పెద్ద లోగిలి చూసుకుని బిచ్చగాడు ధైర్యంగా లోపలికి ప్రవేశించి గృహస్థుతో, "అయ్యా, నేను చాలా దూరం నుంచి వస్తున్నాను. ఈ బస్తీలో ఎరిగినవారెవరూ లేరు. ఈ రాత్రికి మీ ఇంట బస చెయ్యనిస్తారా?" అని అడిగాడు. గృహస్థు సమ్మతించాడు.

ఆ రోజు ఆ గృహస్థు ఇంట ఏదో అక్కర జరిగింది. అందుచేత చాలామంది బంధువులు వచ్చి ఉన్నారు. ఆ రాత్రి పెద్ద ఎత్తున విందుచేశారు. బిచ్చగాడు నలుగురితోబాటు సుష్టుగా భోజనంచేశాడు. ఈ అడావుడిలో ఆ రాత్రి పెయ్యదూడకు మేత వేసేమాట ఎవరికీ జ్ఞాపకం లేకపోయింది. ఒక రాత్రి వేళ ఆ పెయ్యదూడ పలుపు తెంచుకుని, ఇంటివారి గుర్రం ఉండేచోటికి వెళ్లి గడ్డి తినసాగింది. ఆ గుర్రం కాస్తా పెయ్యదూడను తన వెనక కాళ్లతో బలంగా తన్నింది. గిలగిలా తన్నుకుని పెయ్యదూడ చచ్చింది.

మర్నాడు బిచ్చగాడు గృహస్థుతో పోట్లాట పెట్టుకున్నాడు. గృహస్థు సౌమ్యుడు. ఇంటికి వచ్చిఉన్న బంధువుల మధ్య ఎవడో పరాయివాడితో పేచీపడి పోట్లాడటం ఇష్టంలేక ఆయన బిచ్చగాడికి తన గుర్రాన్ని ఇచ్చాడు.

బిచ్చగాడా గుర్రాన్ని ఎక్కి సవారీ అయి దూరాన ఉన్న పట్టణానికి బయలుదేరాడు. దారిలో వాడు, "ఇక నా అదృష్టం తిరిగి పోయింది. ముసలివాడిచ్చిన శనగగింజ మహా గొప్పది. ఇలా గుర్రాలూ, గాడిదలూ సంపాదించటం కాదు, ఈసారి మంచి



ఇల్లూ, చక్కని పెళ్లామూ, ఇంత ఆస్తీ వచ్చేటట్టు చూసుకోవాలి. ఈ సంచారం యింతటితో కట్టిపెట్టి ఒకచోట స్థిరపడి పోవాలి," అనుకున్నాడు.

ఆ సాయంకాలానికి వాడు నగరం ప్రవేశించాడు. వీధివెంబడి పోతూండగా ఒక పెద్ద సత్రమూ, ఆ సత్రం వాకిట ఒక అందమైన పిల్లా వాడి కంట పడ్డారు. ఆ పిల్లను చూడగానే వాడికి అలాటి భార్య ఉంటే బాగుంటుం దనిపించింది. అందుచేత వాడు గుర్రం దిగి సత్రంలోకి వెళ్ళి, అక్కడి గుమాస్తాను బస కావాలని అడిగాడు. గుమాస్తా బిచ్చగాడికి ఒక గది చూపించాడు.



79

బిచ్చగాడు చూచిన అమ్మాయి ఆ గుమాస్తా కూతురే. ఆమె తప్ప గుమాస్తాకు మరొక సంతానం లేదు. ఆమెను తాను పెళ్లిచేసుకుంటే తానుకూడా ఆ సత్రంలోనే ఉండిపోవచ్చు. ఆ విధంగా తనకు ఇల్లూ వాకిలీ, భార్యా, భోజన సౌకర్యమూ, అన్నీ అమరుతాయి.

అందుచేత బిచ్చగాడు సత్రం గదిలో ప్రవేశిస్తూ గుమాస్తాతో, "అయ్యా, నా గుర్రానికి నీరు పెట్టటమూ, దాణా వెయ్యటమూ మొదలైనవి శ్రద్ధగా చూడండి. అది చాలా విలవైన గుర్రం. మామూలు గుర్రాల లాటిది కాదు," అన్నాడు.

ఆ గుర్రం గురించి దాని యజమాని అంతగా చెప్పాడుగదా అని, దాన్ని నీళ్ళ తొట్టి దగ్గిరికి గుమాస్తా స్వయంగా తీసుకు వెళ్ళాడు. అది నీరు తాగినంతసేపు తాగి, గుమాస్తా ఏమరుపాటున ఉన్న సమయంలో, చీకటిలో బయటికి పరిగెత్తి పోయింది. గుమాస్తా బిచ్చగాడివద్దకు వచ్చి జరిగిన సంగతి చెప్పాడు.

బిచ్చగాడు తోకతొక్కిన తాచులాగా లేచి, "నేను ముందే చెప్పలేదా? అంత పొగరా? ఆ గుర్రం విలవ నీకేం తెలుసు? దానికోసం నేను నాకున్నదంతా త్యాగం చేశాను. నా గుర్రాన్ని నాకు ఇప్పుడే తెచ్చి



పెట్టు. నేను తెల్లవారుతూనే బయలుదేరి పెద్ద రాచకార్యంమీద వెళ్లవలిసి ఉన్నది!" అని కేకలు పెట్టాడు.

"తెల్లవారనివ్వండి. నేను ఎంత శ్రమ అయినా పడి తమ గుర్రాన్ని వెతికి ఇప్పిస్తాను!" అని గుమాస్తా ప్రాధేయపడ్డాడు.

"నీ కూతురు కనబడకుండాపోతే తెల్లవారేదాకా ఆగుతావా? నాకు నా గుర్రం అంతకంటె లక్షరెట్లు ఎక్కువ!" అన్నాడు బిచ్చగాడు కోపంగా.

"అయితే ఈ నడిరాత్రి నన్నేం చెయమంటారు?" అన్నాడు గుమాస్తా చాలా చిరాకుపడుతూ.

"నా గుర్రాన్ని పోగొట్టావు గనక నీ కూతుర్ని ఇయ్యి!" అన్నాడు బిచ్చగాడు.

గుమాస్తాకు కోపం వచ్చింది. ఇద్దరూ ఘర్షణపడసాగారు. సత్రం గుమాస్తా భార్య వచ్చి తన భర్తతో, "తప్పంతా మీదే! మీరూరుకోండి. అమ్మాయి ఇష్టపడితే అలాగే ఇద్దాం! ఎప్పటికైనా ఒకఅయ్యచేతిలో పెట్టక తప్పదుకదా! కావాలంటే మటుకు మన కింతకన్న మంచి అల్లుడు దొరుకుతాడా? నేను వెళ్లి అమ్మాయి ఇష్టం కనుక్కొని వస్తాను. ఈ లోపుగా మీరు పోట్లాడుకోకండి!" అన్నది. బిచ్చగాడు తన అదృష్టం పండిందను కున్నాడు.



మరి కాస్సేపటికల్లా గుమాస్తా భార్య అడావిడిగా తిరిగివచ్చి, "అయ్యా, అమ్మాయి మిమ్మల్ని పెళ్లాడటానికి సుతరామూ ఒప్పుకో లేదు. అందుచేత దాన్ని ఒక గోతంలో వేసి కట్టిపెట్టాను. మీరు ఆ గోతం తీసుకుని ఇప్పుడే బయలుదేరి వెళ్లిపొండి. ఈ రాత్రి చీకట్లో మీరు ఎటు వెళ్ళారో దానికి తెలీదు గనక తెల్లవారి గోతంనుంచి బయటికి తీస్తే అది ఇంటికి పారిపోయి రాలేదు. అప్పుడు మీరు నయానో భయానో దాన్ని పెళ్లికి ఒప్పింతురుగాని!" అన్నది.

ఇలా జరుగుతుందని బిచ్చగాడు అనుకో లేదు. అయినా గుమాస్తా భార్య చెప్పిన సలహా బాగానే ఉన్నట్టు వాడికి తోచింది. మొదలు తానా పిల్లను పెళ్ళాడితే తరవాత ఇద్దరూ కలిసి సత్రానికి వచ్చి ఇక్కడే కాపరం పెట్టవచ్చు.

అందుచేత వాడు గోతాన్ని భుజాన ఎత్తుకుని ఆ నిశిరాత్రివేళ బయలుదేరాడు. గోతం ఎక్కువ బరువుగా లేదు గాని, లోపల ఉన్న మనిషి తన్నుకుంటూ ఉండటంచేత ఎత్తుకుని మోయటం బహు ప్రయాస అయింది. దానికి తోడు కన్ను పొడుచుకున్నా కనపడని చీకటిలో తెలియని దారిన నడవవలిసి వచ్చింది. అట్లాగే బిచ్చగాడు ఆ గోతాన్ని మోస్తూ, మధ్యమధ్య దింపుతూ, తెల్లవార్లూ నడిచి తెల్లవారేసరికి ఒక అడివి మధ్యకు చేరాడు.

అక్కడ వాడు గోతాన్ని దింపి, ఎంతో ఆశగా గోతంమూతి విప్పాడు. ఆ గోతంలో నుంచి ఒక పెద్దకుక్క పైకి దూకి అతని ముక్కు కాస్తా కొరికి శరవేగంతో ఎటో పారిపోయింది.

శనగగింజ తెచ్చిన అదృష్టం అంతటితో అయిపోయింది. తెగిపోయిన తన ముక్కుకు చెయ్యి అడ్డంపెట్టుకుని బిచ్చగాడు మళ్ళీ గ్రామాల వెంట తిండి అడుక్కుంటూ జీవయాత్ర సాగించాడు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

**1958** మార్చి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–**26**.

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : దొరలు దోచలేరు

రెండవ ఫోటో : దొంగ లెత్తుకపోరు

పంపినవారు : కె. భాస్కర రామమూర్తి,

S/o. కె. అయ్యవారుశెట్టి, ఒంటిమిట్ట పోస్టు - సిద్ధవుట్ తా॥ (కడప జిల్లా.)

బహుమతిమొత్తం రు. **10**/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# వింతపక్షి

కీవి అనే వింతపక్షి న్యూజీలాండు దేశంలో వున్నది. ఈ పక్షిని గురించి బ్రిటిషు శాస్త్రవేత్తలు 1813 లో మొదటిసారి విన్నప్పుడు అలాటి పక్షి ఉంటుందని వారు నమ్మలేకపోయారుట. అది నిజంగా విడ్డూరమైన పక్షే.



కీవిపక్షికి పిల్లిలాగా మీసాలుంటాయి. తోక లేదు. నామమాత్రంగా రెక్కలున్నాయిగాని, వాటి నిడివి ఒక అంగుళం మాత్రమే. ఎందుకూ పనికిరాని ఈ రెక్కలను అది తన శరీరంమీదగల మృదువైన ఈకల మాటున దాస్తుంది. దాని ముక్కు పొడవుగా, వంగి ఉంటుంది. దాని చివర నాసికా రంధ్రాలుంటాయి!

వీటన్నిటికన్న వింత ఏమంటే అది పెట్టే గుడ్డు దాని బరువుతో పోలిస్తే చాలా పెద్దది. పక్షి బరువు నాలుగు పౌనులైతే గుడ్డు బరువు ఒక పౌనుంటుంది. (కీవి ఉష్ట్ర పక్షిజాతికి సన్నిహితమైనది. కీవి పెట్టే గుడ్డు లెఖ్ఖన ఉష్ట్ర పక్షికూడా పెట్టినట్టయితే దాని గుడ్డు 75 పౌనులుండాలి!) గుడ్లను మగ పక్షులు పొదుగుతాయి. పిల్ల బయటికి వచ్చాక దాని ఆహారం అదే సంపాదించుకోవాలి.

ఎగరలేకపోయినా ఈ పక్షి నేలమీద వేగంగా, చప్పుడు చేయకుండా పరిగెత్తుతుంది. కీవికి కళ్లు సరిగా కనిపించవు. పగటిపూట అది ఒక అడుగుదూరం పైన చూడలేదు. చీకటిలో అంతకన్న బాగా—అయిదారడుగుల దూరం—చూడగలదు. కాని దానికి వినే

శక్తి, వాసన పట్టే శక్తి హెచ్చుగా ఉన్నాయి. దాని ముక్కు స్పర్శేంద్రియంగాకూడా పనిచేస్తుంది. రాత్రిపూట ఇది "కీ—వీ" అని అరుస్తుంది. ఆ అరుపునుబట్టే దానికి నామకరణం చేశారు.

కీవి పొదలలో తన ఆహారాన్ని సంపాదించుకుంటుంది. దాని కాళ్లకు వాడిఅయిన గోళ్లున్నాయి. వాటితో అది మట్టిని తవ్వి బొరియలు చేయగలదు. దానికి వానపాములు చాలా ఇష్టం. వాటిని పట్టుకోవటానికది భూమిమీద కాలితో తట్టి చప్పుడు చేస్తుంది. నేల గుల్లగా ఉన్నట్టు కనిపిస్తే తన ముక్కును భూమిలోకి గుచ్చి వానపాములను పైకి తీస్తుంది. అది నత్తలనూ, కీటకాలనూ, పొట్టిపొదలమీది కాయలనూ తింటుంది.

న్యూజీలాండులోని ఆదిమవాసులు దానిని ఈకలకోసం చంపుతారు. ఈ విధంగా ఈ పక్షిజాతి అంతరించే దశ ఏర్పడింది. అక్కడికి వలసవచ్చిన తెల్లవాళ్లుకూడా 19వ శతాబ్దంలో దీన్ని ఆహారంకోసం వేటాడారు.

ఈ పక్షులను పెంపకం చెయ్యటానికి జరిగిన ప్రయత్నాలు అంతగా ఫలించలేదు. కాని ఈ ప్రయత్నాలింకా సాగుతూనే ఉన్నాయి.



# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు 'టైగర్'ను వెంటపెట్టుకుని, ఊరిబయటికి షికారు బయలుదేరారు. దారిలో ఒకచోట గొర్రెపొటేలును మేముతున్న కొంటె కుర్రవా డొకడు, వాళ్లనుచూసి, పొటేలును వాళ్లమీదికి ఉసికొల్పాడు. పొటేలు, దాసూ వాసూలను ఢీకొట్టేందుకు వెంటబడింది. ఈ లోపల 'టైగర్' వెళ్ళి కొంటె కుర్రవాణ్ణి పట్టుకున్నది. వాడు కేకలుపెట్టేసరికి, పొటేలు వెనుదిరిగి వచ్చి, 'టైగర్'ను ఢీకొట్టబోయి, అది పక్కకు పరిగెత్తేసరికి, తన యజమానినే ఢీకొట్టింది. కొంటె కుర్రవాడు అరుస్తూ ముందున్న నీళ్లగుంటలో పడిపోయాడు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'







ఎప్పుడు దేనితోను
ఫలితం కనబడదో...

... మేనర్స్
గ్రైప్ మిక్చర్ యిచ్చి

దానికి బదులు వచ్చే
చిరునవ్వు చూడండి




"మదర్‌క్రాఫ్ట్ అండ్ చైల్డ్ కేర్" అను మా 40 పేజీల పుస్తకానికి వ్రాయండి. ప్రతి సీసాతోడు వుండే కూపన్‌తో పాటు, మీ చిరునామా, 40 నయాపైసల స్టాంపులతో సహా పోస్ట్ ఆఫీస్ బాక్స్ 976, బొంబాయి 1. కి వ్రాయండి.

మంచి రకాలలో శ్రేష్టమైన యీ చిహ్నం చూడండి. GM ఇది మేనర్స్ ఉత్పత్తి

GEOFFREY MANNERS & CO. PRIVATE LTD., BOMBAY · DELHI · CALCUTTA · MADRAS.

ASP/GM6

87

TIC-54 a

Photo by Ravinder Kumar Paul



బహుమతి
పొందిన వ్యాఖ్య

దొంగ లెత్తుకపోరు

పంపినవారు :
కె. బి. రామమూర్తి - ఒంటిమిట్ట

